ఓ౩మ్

# మానవ కల్యాణ దర్పణము

## వైదికధర్మ బోధామృతము

### అను జ్ఞానాంజనము



శ్రీ మహర్షి స్వామి దయానంద సరస్వతులు


ర చ యి త :

మంత్రిప్రగడ వేంకటేశ్వరరావు


1983

*ఆర్య మహాశయులారా !*

పట్టణములందుగాని, పెద్ద గ్రామములందుగాని, పల్లెలలోగాని వైదిక (వేద)ధర్మ ప్రచారము ఆంధ్ర భాషలో చేయించదలచినచో ఈ క్రింది వారితో సంప్రదించగలరని కోరుచున్నాము.


## మంత్రిప్రగడ వేంకటేశ్వరరావు

(వైదిక ధర్మోపదేశకులు)

## మంత్రిప్రగడ రఘునాధరావు

ఆకాశవాణి మరియు దూరదర్శని కళాకారులు, (ఆర్యభజనోపదేశకులు)

ఇ. నెం. B-436, వనస్థలిపురం, హైదరాబాదు-500 661




ఈ క్రింద తెలుపబడిన విషయముల గురించి ఉపన్యాసములు మరియు భజనలు ఉండును.

1) ఈశ్వరసిద్ధి
2) ఈశ్వరోపాసన
3) ధర్మము – దాని ఆవశ్యకత
4) వేదములు – వేదముల ప్రాశస్త్యము
5) పంచమహా యజ్ఞములు
6) షోడశ సంస్కారములు
7) దేవీదేవతలు
8) పునర్జన్మ
9) వర్ణాశ్రమములు
10) మన పండుగలు

మొదలగు ననేక విషయముల గురించి ప్రచారము చేయబడును.

ఓ౩మ్

# మానవ కల్యాణ దర్పణము

## వైదికధర్మ బోధామృతము

### అను జ్ఞానాంజనము





శ్రీ మహర్షి స్వామి దయానంద సరస్వతులు


ర చ యి త :

**మంత్రిప్రగడ వేంకటేశ్వరరావు**



వైదిక ధర్మ గ్రంథమండలి

(స్థాపితము : బహుధాన్య 1938)

ప్రకాశకులు - సంపాదకులు

*1983*


అమూల్యమైన ఈ గ్రంథము వెల దాతలయొక్క ఔదార్యమే

ప్రతులు : 1000

దుందుభినామ సం॥ర

నిజ ఫాల్గుణము

వెల : దాతలయొక్క ఔదార్యమే

పుస్తకము దొరుకు స్థలము :

మంత్రిప్రగడ వేంకటేశ్వరరావు

ఇం. నెం. బి. 436 వనస్థలిపురం-హైదరాబాదు 500 661.

ముద్రణ :

పద్మా పవర్ ప్రెస్,

కుత్బీగూడ, హైదరాబాదు - 27.

# పీఠిక

ఈ గేయ శతక రచయిత శ్రీ మంత్రిప్రగడ వెంకటేశ్వరరావు గారు. హైదరాబాద్ నగరమునందలి వైదిక 'ధర్మ గ్రంథమండలి'కి వీరు ప్రకాశకులు-సంపాదకులు. మరియు వేద ధర్మము అను మాసపత్రికకు కూడ సంపాదకులుగా నుండి ధర్మప్రచారముతోపాటు చిరకాలముగా భాషాసేవ చేయుచున్నారు. ఇతఃపూర్వము వీరు (1) మంత్రిప్రగడ వారి మాట వినుడు (పద్యములు) (2) విజయభేరి (3) జై ఓం అను గేయములను రచించి ప్రకటించినారు. ఇవి కాక 'జీవేశ్వర సంబంధము 2. మన పిల్లల శిక్షణము 3. మనస్వామి 4. బ్రహ్మచర్య మాహాత్మ్యము 5. పతితోద్ధరణ 6. గొఱ్ఱెదాటు 7. దాన దుర్గతి 8. ఆర్యసమాజ పరిచయము 9. విడిపోయిన మన సోదరులు 10. మన సంస్కృతి మొదలగునవి వీరి అనువాద గ్రంథములు. ఇంతమాత్రమే గాక ఇతర రచయితల వైదిక ధర్మగ్రంథములు కూడ దాదాపు 50 వరకు ప్రకాశము గావించిరి. వీరి అముద్రిత రచనలు కొన్ని గలవు. ఇట్టి వీరి రచనలనుబట్టి వేదములయందును వేదధర్మముల ఎడలను, వాని ప్రచారముపట్లను మరియు దేశము, సంస్కృతి, సమాజము అను ఇత్యాద్యనేక ప్రముఖవిషయముల ఎడ శ్రీ వేంకటేశ్వరరావు గారికి గల భక్తి శ్రద్ధలు ఆదరాభిమానములు స్పష్టము లగుచున్నవికదా!

శ్రీ మంత్రిప్రగడ వారికి వేదములే ప్రామాణిక గ్రంథములు. వేద ప్రోక్తములైన వైదిక ధర్మములే అవశ్యాచరణీయములు. శ్రీ మహాఋషి దయానందులే భావనా గురుదేవులు. వారు రచించిన "సత్యార్థప్రకాశ"మే "అభినవగీత". వారు స్థాపించిన ఆర్యసమాజమే అసలైన సిసలైన మానవసమాజము. లోపభూయిష్ఠమైన నేటి సమాజమును వైదిక ధర్మాను

ధర్మమును బోధించుటే యిందలి ప్రధాన విషయము. వైదిక ధర్మ ప్రబోధమే ఉద్దేశ్యము. ధర్మాధర్మ సత్యాసత్య జ్ఞానాజ్ఞాన ఈశ్వర అనీశ్వర ఇత్యాద్యనేక సదసద్ విజ్ఞాన సంపల్లాభమే ఈ గ్రంథ పఠనమువలన గలుగు ఫలము.

వేదము సద్ గ్రంథము. అది సత్యవిద్యలను బోధించును. జాతి మత స్త్రీ పురుష విచక్షణారహితముగా అది సర్వజన పఠనీయము. వైదిక ధర్మాచరణమే సత్యసుఖ సాధనము. పరమేశ్వరుడు నిరాకారుడు. ఓంకారమే అతని ఉత్తమ నామము. అదియే ఏకైకమంత్రము. ఓంకారధ్యాన జపాదులచే బ్రహ్మజ్ఞానము సిద్ధించును. వైదిక కర్మానుష్ఠానము అవశ్యకర్తవ్యము. మద్య మాంసాది పంచమకారములను పరిహరించి, బ్రహ్మ, దేవ, పితృ, అతిథి, భూతయజ్ఞాదు లనునట్టి పంచ మహాయజ్ఞములచే పరమార్థమును సాధింపవలెను. వేద పఠన పాఠనాదులు బ్రహ్మచర్య యోగాభ్యాసములు భగవద్ భజన ధ్యానోపాసనాదులు ఈశ్వరార్పణముగ ఆచరింపవలెను. ఆర్యధర్మ వర్తనుడై మానవుడు దేశసేవ, మానవ సమాజసేవకు అంకితుడు కావలెను. ధర్మరక్షణ, దేశరక్షణ ప్రతి మనుజుని జీవితలక్ష్యము గావలెను. ఇత్యాది సకల జనసమ్మతములైన ఉత్తమధర్మము లనేకము లిందు సహజ, సరళ, సరస గేయ రూపమున బోధింపబడియున్నవి. ఇవి యెల్లరకు శిరోధార్యములు, ఆచరణీయములు.

అయినా ఈశ్వరుడు నిరాకారుడు. అతడు సాకారుడనుట అజ్ఞాన మూలము. విగ్రహములు, జడ మూర్తులు తదారాధనము వ్యర్థము. అవతారములు అవిచారకల్పనలు. మృతకశ్రాద్ధములు వ్యర్థములు. పశు బలులతో కూడిన యజ్ఞ యాగాదులు కుకర్మలు. నియోగము" ఆపత్కాలములో ఆచరణయోగ్యము. ఇత్యాది వైదికధర్మములు కొన్ని కూడ

యిందు బోధింపబడినవి. అవి యథార్థములే కావచ్చును. కాని వివాదాస్పదములు. ఇట్టివి జనబాహుళ్యమునకు మనస్కరింపవేమో. నచ్చిన వారు మెచ్చవచ్చును.

మొత్తముమీద దేశ, మానవ, సమాజ నీతి యిత్యాది ఉత్తమ వైదిక ధర్మబోధలు గల ఈ పొత్తము ఉత్తమమనుట రిత్తగాదు. ఇందలి బోధలను చక్కగా చదివి తెలిసికొని ఆచరించినవారు తప్పక ఇహ పర సుఖములను పడయగలరనుట తథ్యము.

శ్రీ వేంకటేశ్వరరావుగారు గీర్వాణ భాషా పరిచయము గూడ గలవారు. ఆంధ్రములో, హిందీలో, ఉర్దూలో ధారాళముగా ధాటిగా ఉపన్యసించగలరు. తెలుగులో (పద్యగేయ) కవిత్వము చెప్పగల సామర్థ్యము వీరికి కలదని ప్రత్యేకముగా చెప్పనవసరము లేదు. వారి పూర్వ రచిత పద్య గేయకృతులును ప్రస్తుత గేయకవితారూప వైదిక ధర్మ ప్రబోధమును యిందుకు నిదర్శనములు. నాకు తెలిసినంతవరకు శ్రీ వేంకటేశ్వరరావుగారు లక్షణము మొదట నేర్చి పిమ్మట కవిత చెప్పుటకు యత్నించలేదు.

సహజముగా ప్రతిభావంతులైన వీరిని ప్రౌఢ వయస్సులో కవితా కన్య వరించి వచ్చినది. కావుననే వీరి పద్యములందుగాని గేయములందు గానీ, భావ భాషా అన్వయ కాఠిన్యాదులు గోచరింపవు. అర్థ క్లేశము అసలే ఉండదు. రాట్నముమీద నూలు పోగువలె రచన సాఫీగా సాగిపోవుచుండును. భావస్పష్టతయేగాని క్లిష్టత ఎచ్చటను పొడసూపదు. తాము చెప్పదలచిన వ్రాయదలచిన విషయమును విస్పష్టముగా, నిర్దుష్టముగా వ్రాయగల భాషా వైదుష్యము వీరికి గలదు. ధారాశుద్ధి సారళ్య సారస్యం వీరి కవితకు ముఖ్య లక్షణములు. సీస, గీత, ఆటవెలది

పద్యముల నధికముగా వ్రాయుదురు. పద్యరచన కంటె గేయరచన యందు వీరికి అభిమానము మెండు. అభ్యాసము కూడ అధికమే. అందుకే సంఖ్య యందును ప్రచారమునందును వీరి గేయములదే పైచేయి.

ఇక ఈ ప్రస్తుత గ్రంథరచనా విధానమును గూర్చి కొంత ఆలోచింతము. ఈ గ్రంథము ద్వారా వైదిక ధర్మప్రచారము జేయుట ఈ కవి ముఖ్యోద్దేశము. పద్యములకంటె గేయమే సులభమై సర్వజన సుబోధముగా నుండును. అంతేకాదు, రాగ తాళ యుక్తముగా పాడుకొనుటకు అనువుగానుండి ప్రజాసామాన్యమును ఆకట్టుకొను శక్తి గలది గేయమే. కావున పద్యముకంటె గేయమే ప్రబల ప్రచారసాధనమనుట సత్యము. వైదిక ధర్మప్రచారము లుద్దేశించిన కవి దీనిని గేయకవితగా రచించినాడు. ఆర్యసమాజమునకే తనజీవితము నంకితముజేసిన ఈ కవి తత్ సమాజ స్థాపకులును సత్యార్థప్రకాశక గ్రంథకర్తలును అయిన స్వామి దయానందులు పై గ్రంథములో తెలిపిన వైదికధర్మములను సమాజ హితము గోరి గేయరూపమున రచింపదలంచిరి. దయానంద గురుదేవుని వైదిక ధర్మబోధ వినిపించెదను – ధర్మబోధనే తెలిపెదను అని ఈ కృత్యాదిలో కవియే స్వయముగా తెలిపియున్నారు. ఈ పైనుదహరించిన గేయ పాదములు మనకు శ్రీహనుమాన్ గురుదేవులు నా ఎద దెలిపిన సీతారామ కథ నే వినిచెద సీతారామకథ అను శ్రీ M.S. రామారావుగారి సుందరాకాండ గేయ శైలిని తలపింపునట్లున్నది. కావున ఈ వైదిక ప్రబోధ గేయములు యిట్టి శైలిలో వ్రాయుటకు పై సుందరాకాండ గేయశైలి ప్రేరకము కావచ్చును.

వైదికధర్మ బోధామృతము పుటలు తెరచి లోన చూచిన యిది రెండు భాగములుగా రచింపబడినట్లు స్పష్టపడును. యిందలి మొదటి భాగమునందు అష్టోత్తరశత (108) సంఖ్యగల గేయపుష్పములు వైదిక

ధర్మమను పవిత్రసూత్రమున ప్రబోధమాలికగా గూర్చబడినవి. ప్రతి గేయము చివర స్వామిదయానందులకు జై జై జై అను సాధువాదము పలుకబడుటచే ఈ ప్రబోధ పుష్పమాల శ్రీదయానందులకే మానసికముగా సమర్పింపబడినట్లు తోచును. ఇక రెండవభాగమునందు "ఈశ్వర ప్రార్థనోపాసములు" అను ప్రత్యేక శీర్షికక్రింద 37 గేయములు కూర్చబడియున్నవి. వీనికన్నిటికి మంత్రిప్రగడవారే ప్రత్యేక రాగతాళములను తెలిపియున్నారు. ఈ కీర్తనలు కూడ అనేకధర్మములను బోధించుచు ఈశ్వరుని భజనకు మిక్కిలి ఉపయుక్తముగా వ్రాయబడినవి. వీనిలో చాల కీర్తనల చివర కవినామము కూడ చేర్చబడినది. సాధారణముగా త్యాగరాజాది భక్తి వేదాంత కీర్తన లిట్లే కవి నామయుక్తములుగా వ్రాయబడుట పరిపాటి. ఈ కీర్తనలు దైవభక్తిని గలిగించి మనశ్శాంతిని ప్రసాదించునవిగా నున్నవి.

ఇందలి మొదటి భాగమునందలి (108) గేయమంజరులును ఒక్కొక్కటి నాల్గేసి చరణములు కలిగియున్నది. ఆటవెలది (కంద) పద్య పాదములవలె ఈ గేయములలోని ఒకటి మూడు పాదములకంటె రెండు నాల్గు పాదములు యించుక చిన్నవిగా గోచరించుచున్నవి. ఈ నేమమువలన వీరి గేయగుణము కొంత విస్తరించి శ్రావ్యత్వము హెచ్చినది. ఈ కవిగారు యించుమించుగా ఈ గేయములన్నింటనూ మొదటి రెండు పాదములకును చివరి రెండు పాదములకును ఆద్యక్షరరీతి లేదా ద్వితీయాక్షరప్రాసనేమమునో పాటించినారు. పలుచోట్ల యందు రెండు నాల్గు పాదముల చివర భజించుడనె, పీడుడనె, కొలువుడనె ప్రమాణమనె, అని తెలిపే, బోధించే, వివరించే, అచ్చులకుగానీ హల్లులకు గానీ అంత్యప్రాసములు గూడ కూర్చబడినవి. రచన కొన్నిచోట్ల ఈ నియమములకు భిన్నముగా కూడ లేకపోలేదు. అయినా నియమ భంగముకంటె నియమపాలనమే అధికముగా చేయబడినది.

ఇంకొక ముఖ్యవిషయ వేమన యిందలి మొట్టమొదటి గేయము తుద దయానందునకు జై జై కారమును పలుకునట్టివి. స్వామి దయానందునకు జై జై జై మహర్షి దయానందునకు జై జై జై అనుడీ దయానందునకు జై జై జై మూడు జయవాదములు వరుసగా కూర్చబడి వున్నవి. శ్రీ మంత్రిప్రగడ కవి పై మూడు జయవాద పాదములను స్వామి, మహర్షి, అనుడీ అను అదే వరుసలో రెండవ గేయము మొదలు కొని ప్రతి మూడు గేయముల చివర అదే క్రమముగా చేర్చియున్నారు. ఈ నేమము చిత్రమైనదే కాక ముఖ్యమైనది కూడ. ఈ గేయములు సంఖ్యలో 108 గా కూర్చబడుటయు ఇవి యించుమించు సమానములైన నాల్గేసి చరణములు కలిగి యుండుటయు ప్రతి గేయము చివరి మూడు పాదములలో ఒకదానిని అదే వరుసలో ప్రతి మూడుగేయముల చివర కూర్చబడుట ముఖ్యముగా గమనింపదగియున్నది. ఇది 'విశ్వదాభిరామ వినురవేమ' అను సంప్రదాయమును బోలినది శివతత్వ సారమునందు శివ, అజా, రుద్ర ఇత్యాది భిన్న మకుటములు పద్యముల చివర నున్నట్లే యిందలి మకుటములందు దయానందులకు జై జై జై అను సామ్యమె అధికముగా నున్నది. వీనిని మొదట స్వామి, మహర్షి, అనుడీ అని కొన్ని భిన్న పదములున్నవి. అయినా ఈ మకుటములు ఒక నియమము ననుసరించి కూర్చబడుటచేతనూ, ఈ గేయముల సంఖ్య అష్టోత్తర శతము (108) గా నుండుటచేతనూ యిది వొక గేయశతకమని చెప్ప వచ్చును. ఇంతేకాక ఈ గ్రంథములో ముఖ్యముగా వైదిక ధర్మము వైదిక సిద్ధాంతములు మరియు ననేక నీతులు బోధింపబడియున్నవి. అవైదిక విషయములు ఖండింపబడియున్నవి. బాల్య వృద్ధ వివాహాదులు అస్పృశ్యతా యిత్యాది దురాచారములను భూత, ప్రేతాదులందలి మూఢ విశ్వాసములును నిరసింపబడినవి. మరియు సర్వజన సుబోధమైన సరళ శైలిలో ఈ గేయములు రచింపబడియున్నవి. ఈ అన్ని కారణములచేత

ఇది శతకమనుటకు తగియున్నది. గేయములలో వ్రాయబడుటచేత దీన్ని గేయశతకమనుట సమంజసము. తెలుగులో యింతవరకును పద్య శతకములే కాని గేయ శతక మొక్కటియు వున్నట్లు లేదు. శ్రీ మంత్రి ప్రగడ వేంకటేశ్వరరావు గారు రచించిన ఈ వైదిక ధర్మప్రబోధమే తెలుగులో మొట్టమొదటి గేయ శతకమనియు తెలుగు శతక చరిత్రలోనే ఇదియొక నూత్న ప్రయోగమనియు చెప్పవలసియుండును. యిట్లు గేయ శతక రచనమను నవ్యప్రక్రియను చేపట్టి దాన్ని విజయవంతముగా నిర్వహించిన శ్రీ వేంకటేశ్వరరావుగారిని మనఃపూర్వకముగా అభినందించుచున్నాను. గేయ శతక రచనకు మార్గదర్శియైన మంత్రిప్రగడ వారు తెలుగు శతక వాఙ్మయ చరిత్రలో చిరస్మరణీయులు కాగలరు. చిరకాల స్నేహమును పురస్కరించుకొని ఈ అపూర్వ గేయ శతకమునకు పీఠిక రచించు సదవకాశము నాకు కల్పించిన శ్రీ వేంకటేశ్వరరావు గారికి నా కృతజ్ఞతలు.

ఈ మానవకల్యాణ దర్పణమున అనుబంధముగ ముద్రింపఁబడిన శ్రీయుతులు ఆదిపూడి సోమనాధరావు, మరియు పల్లా రామకోటార్య గారల గేయములు మిక్కిలి ప్రశంసార్హములుగా నున్నవి. ఇటులే చి॥ రఘునాధరావుగారి జానపదగేయములు జనాకర్షణీయంగా నున్నవనుటలో నెంతమాత్రము సందియములేదు.

డా॥ పల్లా దుర్గయ్య
M.A.P.hd.,
ఉస్మానియా విశ్వవిద్యాలయము,
హైదరాబాద్-(ఆం.ప్ర.)

దివి. 12-3-1982

# పరిచయము

పందొమ్మిదవ శతాబ్దిలో జన్మించిన మహాపురుషుడు మహర్షి దయానందుడు. వీరు వేదసందేశమును జగత్తున కందించి, వేదోద్ధరణ గావించిన జగద్గురువులు. మానవులందఱకు వేద పఠనాధికారమున్నదని చాటిన ప్రథమాచార్యులు వీరే. మానవోద్ధరణకు గావలసిన సమస్త ధర్మముల ప్రబోధించి, మూఢ విశ్వాసములను, దురాచారములను, అసత్యములను నిర్మోగమాటముగా ఖండించి సత్యమునే చాటి జ్ఞాన భాస్కర కిరణముల సర్వత్ర ప్రసరింపజేసిన ధీర పురుషుడు. ఈ మహనీయుడు వేద భాండాగారములోగల వివిధములగు అమూల్య జ్ఞాన రత్నముల నొకచో జేర్చి 'సత్యార్థ ప్రకాశ'మను అత్యుత్తమ గ్రంథ రాజమును మానవుల కొసగిన యసమాన పాండిత్య ధీవిశారదుడు. బానిస భారత జాతి దుస్థితికి కన్నీరు గార్చి స్వరాజ్యసముపార్జనవల్లనే దేశము, జాతి యున్నతిగాంచునని ప్రబోధించిన దేశభక్తుడు. ఏకేశ్వరోపాసనమును బోధించి, వివిధ మతములలోగల విజ్ఞాన వ్యతిరేక విషయములను నిర్భయముగా జూపి, ధైర్య సాహసములతో దేశమంతట పర్యటనజేసి, జాతిలో సమైక్యతను సాధించుటకు పాటుబడిన మహాతపస్వి. విషమిచ్చిన వారిపైనను దయజూపి, జాతి మూర్ఖతకు వగచి, దాని శ్రేయస్సునే కాంక్షించిన నిస్స్వార్థ జీవి.

అట్టి మహర్షి జీవితమును, సరళ మధుర శైలిలో గేయముగా గూర్చి గాయకులకు, శ్రోతలకు కర్ణానందముతోపాటు ఆ మహా పురుషుని దివ్యసందేశము నందించుటకు శ్రీ మంత్రిప్రగడ వేంకటేశ్వరరావు గారు పూనుకొనుట యెంతయో హర్షదాయకము. ఈ రచయిత వైదిక సాహిత్యమును ప్రచురించి ప్రజల కందించుటలోనే జీవితము గడిపిన ధన్యజీవి.

ఈ గేయములోని ఋషిసందేశమును గ్రహించి తెలుగు జాతి తరించినచో ఈ రచయిత కృషి సఫలమగును. సహృదయులు ధర్మాభిమానులు ఈ గేయప్రచారమునకు మనఃపూర్వకముగా తోడ్పడుదురుగాక.

ఇట్లు

సూర్యాపేట,
31-3-83

ఎన్. విశ్వమిత్ర
తెలుగు లెక్చరరు
ప్రభుత్వ కళాశాల, నల్లగొండ.

# విజ్ఞప్తి

*ఆర్యా మహాశయురాలా !*

పరమపిత పరమాత్మ ప్రేరణవలన మహర్షి శ్రీమద్దయానంద సరస్వతీ స్వాములవారు బోధించిన వైదిక ధర్మసిద్ధాన్తములను "మానవ కల్యాణ దర్పణము" "వైదిక ధర్మబోధామృతము" అనుజ్ఞానాంజనమును గేయరూపమున సర్వజన సుబోధకముగ నుండవలెనను యుద్దేశముతో రచించితిని. ఈ నా సంకల్పము ఎంతవరకు నెరవేరినదో పాఠకులే నిర్ణ యించ నర్హులు.

వైదిక ధర్మప్రచారము విరివిగా కావలయునను యుద్దేశ్యముతోనే నే నీ రచన గావించితిని భాషా విషయమునగాని, సిద్ధాన్త విషయమున గాని ఏవేని దొసగులు దొర్లినచో విజ్ఞులు సూచించెదరనియు అట్టి లోపములు సరియైనవని తోచిన పక్షమున వాటిని మలి ముద్రణయందు సవరించుకొని సూచించిన మహానుభావులకు హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపుకొనెదనని మనవి చేయుచున్నాను.

నేను కోరినంత మాత్రముననే శ్రమయనక పీఠికను వ్రాసి యిచ్చిన శ్రీ డా॥ పల్లా దుర్గయ్య M. A P h d. ఉస్మానియా విశ్వవిద్యాలయము, గారికి, మరియు పరిచయము వ్రాసి యిచ్చిన శ్రీ యన్. విశ్వమిత్ర తెలుగులెక్చ్చరరు, ప్రభుత్వకళాశాల, నల్లగొండ గారికి నాహృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాను. మరియు ఇందుగల దొసగులను సవరించి నాకు తోడ్పడినశ్రీపల్లా రామకోటార్యగారికి నా హృదయపూర్వక కృతజ్ఞత లర్పించుకొనుచున్నాను.

శ్రీ పద్మాపవర్ ప్రెస్సు యజమానులు శ్రీ తాళ్ళపల్లి ఆనంద గుప్తగారికి, మరియు ప్రెస్సు మేనేజరుగారయిన పడుచూరి శ్రీనివాసులు గారికి, అచ్చుతప్పులు లేకుండా సవరించిన శ్రీ సుసర్ల వేంకటేశ్వరశాస్త్రి గారికి, ప్రెస్సు సీనియర్ కంపోజిటర్లు ఎ. ప్రభాకర్, మానిక్ రావ్‌గారలకు మరియు ప్రెస్సు సిబ్బంది వర్గమువారికి, మా గ్రంథ ముద్రణకు సర్వ విధముల ఏ లోపమూ లేకుండ తోడ్పడినందుకు మా హృదయపూర్వక కృతజ్ఞత లర్పించుచున్నాము.

సంపాదకులు

**మంత్రిప్రగడ వేంకటేశ్వరరావు**

# విషయసూచిక

ఓమ్

# శ్రీ దేవనాథ ఆర్యాగారి సంక్షిప్త జీవితము

కీ॥ శే॥ శ్రీ దేవనాథ ఆర్యాగారు పి. వీరమ్మ సత్యనారాయణ (ముల్కి)గార్ల ప్రథమ పుత్రుడు. వీరు శుక్ల నామ సం॥ర వైశాఖ బ॥ దశమీ శుక్రవారం ది. 28-7-1929న జననమందిరి. శ్రీ పం॥ విశద్ ప్రసాద్‌గారు వైద్య కృష్ణగంజ్ ఆర్యసమాజములలో వీరికి ఉపనయనము జరిపి చదివించారు. మరియు పం॥ గంగారామ్‌గారు గూడ వీరికి గురువులుగా నుండి విద్యాభ్యాసము చేసిరి. ది. 1-4-38 చైత్ర శు॥ పాడ్యమి రోజున శ్రీ పం॥ బన్సీలాల్ వ్యాస్‌గారు స్థాపించిన అనంతగిరి గురుకులములో దేవనాథ్‌గారిని చేర్పించిరి. అప్పుడా గురుకులములో వీరితోపాటు నలుగురు బ్రహ్మచారులు మాత్రమే యుండిరి. అనంతగిరి గురుకులమునందు బ్రహ్మచారులు శీతజ్వరముచేత బాధపడుచుండినందున ఆ గురుకులమును ఘటకేశ్వరమను గ్రామమునకు మార్చబడినది. శ్రీ దేవనాథ్‌గారు ఇచ్చట హిందీ, సంస్కృతముల నభ్యసించి పరీక్షలిచ్చి యింటికి వచ్చియుండిరి. తరువాత ఇస్సామియా బజారులోని శ్రీ నరసింహాచార్యులవారి నాలుగవ కుమార్తె చి॥ ల॥ సౌ॥ జయలక్ష్మీదేవిని శ్రీ దేవనాథ్ ఆర్యాగారికి యిచ్చి నారాయణగూడాలోని కేశవ స్మారక ఆర్య విద్యాలయములో శ్రీ పండిత గోపదేవశాస్త్రి దర్శనాచార్యులవారి పౌరోహిత్యమున వైదిక పద్ధతిలో వివాహము జరుపబడెను.

శ్రీ పండిత కృష్ణదత్తువారి సతీమణి కౌసల్యాదేవి దంపతులు కన్యాదానము చేసిరి. మరియు శ్రీ పం॥ బన్సీలాల్ వ్యాస్ ప్రభృతులు ఆశీర్వాదము లిచ్చిరి. పిదప కొంతకాలమునకు శ్రీ జయలక్ష్మి దేవనాథ్‌గారలకు కలిగిన పుత్రునకు శ్రీ పం॥ మంజూనాథ్ శాస్త్రి డా॥ శ్రీమతి సునీతీదేవి

దంపతులు ఆ పుత్రునికి సోమనాథ్ అని నామకరణము చేసిరి. తరువాత కోఠివద్ద ఆర్యన్‌స్టూడియో నడుపుతూ ఆర్య సమాజ కార్యక్రమాల్లో శ్రీ దేవనాథ్ దంపతులు చురుకుగా ప్రచారకార్యము సాగించిరి. సుల్తాన్ బజార్ ఆర్యసమాజములో మంత్రిగను దేవీదీన్‌బాగ్ ఆర్యకన్యా విద్యాలయమునకు వ్యవస్థాపకులుగా ఉండి శ్రీ దేవనాథ్ ఆర్యగారు మిక్కిలి ఖ్యాతి గడించిరి. వీరి ఏకైక పుత్రుడు చి॥ సోమనాథ్‌గారు గూడ తండ్రివలె సామాజిక కార్యములలో పాల్గొనుచు పనిచేయుచున్నారు. శ్రీమతి జయలక్ష్మీదేవిగారు ఆర్యసమాజ్ సుల్తాన్ బజార్‌లో ప్రస్తుతము ఉపమంత్రిణిగా ఎన్నుకొనబడియుండిరి. వీరి కుటుంబ సభ్యులందరు వైదిక సిద్ధాంతముల పాటించుటలో నిష్ణాతులని చెప్పక తప్పదు. సమాజ కార్యములందు వీరికున్న శ్రద్ధాభక్తులు ప్రశంసనీయార్హములు.

పరమేశ్వరుడు వీరి కుటుంబ సభ్యులకు ఆయురారోగ్యైశ్వర్యముల నొసగి సర్వదా కాపాడుచుండ గలందులకు పరమేశ్వరుని ప్రార్థించుచున్నాము.

కీ॥శే॥ దేవనాథ్‌గారి స్మారకార్థము "వైదిక ధర్మ గ్రంథ మండలి"కి శాశ్వత ప్రధాన మహారాజ పోషకులుగా సభ్యత్వము స్వీకరించి "మానవ కల్యాణ దర్పణము"ను గ్రంథ ముద్రణకు రూ. 1116/-లు విరాళముగా నొసగి సహకరించిన దేవనాథ్‌గారి కుటుంబసభ్యులకు మా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాము.

ఇట్లు

**సంపాదకులు - ప్రకాశకులు**

"వైదిక ధర్మ గ్రంథ మండలి"

బి-436, వనస్థలిపురం,

హైదరాబాద్ - 500 661

ఓమ్

# శాశ్వత ప్రధాన మహారాజ పోషకులు



శ్రీ పి. సత్యనారాయణగారు (ముల్కి)

వీరి

ప్రథమ పుత్రుడు, కోడలు



శ్రీ॥ శే॥ దేవనాధార్యగారు, ధర్మపత్ని విజయలక్ష్మీదేవిగారు

న్యూ మలకపేట, దయానందనగర్, హైదరాబాద్-36.

ఓ౩మ్

గ్రంథ రచయిత



రాజధానిలోని కిషన్‌గంజ్ ఆర్యసమాజ 56వ హోలీ మహోత్సవ
ఊరేగింపు సందర్భమున గజారూఢులైన
శ్రీ మంత్రిప్రగడ వేంకటేశ్వరరావు
(వైదిక ధర్మోపదేశకుల) వారి
ఛాయాచిత్రము ఇందు గాంచనగును.



కృణ్వన్తో విశ్వమార్యం

# మానవ కల్యాణ దర్పణము

## వైదికధర్మ బోధామృతము

అను

జ్ఞానాంజనము

1 శ్రీ; దయానంద ఋషివర్యుని వైదిక
ధర్మబోధ వినిపించెదను
ధర్మబోధనే దెలిపెదను
ధాత్రిని సౌఖ్యము గోరిన వైదిక
ధర్మాచరణమె శరణమనె
స్వామి దయానందునకు జయజయజయ్
మహాఋషి దయానందునకు జయజయజయ్
అనుడీ దయానందునకు జయజయజయ్

2 దయానంద గురుదేవుని వైదిక
ధర్మబోధ వినిపించెదను
ధర్మబోధనే దెలిపెదను
ధర్మాధర్మము లేవో దెలిపి
అధర్మమార్గమును విడువుడనె ॥స్వామి॥

3 సత్యార్థ ప్రకాశము రచియించి
సత్యాసత్యములను వివరించె
నిత్యము పఠించి మానవులెల్లరు
సత్యవ్రతులై మనుడనియె ॥మహాఋషి॥

4 సత్యవిద్యలకు విద్యలు దెలిపెడి
సర్వ పదార్థ చయంబులకు
ఆదిమూల మా పరమేశ్వరుడని
ఆత్మతోటి యోచించుడనె ॥అనుడీ॥

5 సత్తు చిత్తు ఆనందరూపుడగు
సర్వేశ్వరుని భజించుడనె
మెచ్చియిచ్చు సర్వంబు నాతడే
తుచ్ఛ కామనల వీడుడనె ॥స్వామి॥

6 సర్వ వ్యాపకుడగు పరమాత్ముని
సర్వమందు గనుగొనుడనియె
గర్వ రహితులై సతత మీశునకు
సర్వ మొసంగి తరించుడనె ॥మహాఋషి॥

7 అజరుడు అమరు డనంతుడు నిత్యుడు
అభయుడు నఖిలాధారు నెదన్
సుజనులైన యోగులవలె గొలుచుచు
నిజమగు సుఖముల బడయుడనె ॥అనుడీ॥

8 సగుణ నిర్గుణుని సర్వాధారుని
సర్వేశ్వరుని భజించుడనె
నిరాకారునిన్ నిర్వికల్పునిన్
నిత్య పవిత్రుని గొలువుడనె ॥స్వామి॥

9 నిర్వికారుని నిరుపమానుని
నిరతము స్మరింప వలెననియె
అనంతుడగు సర్వాంతర్యామిని
అతిభక్తిని ధ్యానించుడనె ॥మహాఋషి॥

10 సృష్టి స్థితిలయములకు కారణం
బెట్టి శక్తి గలదో అదియే
సృష్టి కర్తయని అతని ఉపాసన
తుష్టి బొందుటకు జేయుడనె ॥అనుడీ॥

11 వేదము సమస్త సత్యవిద్యలను
బోధించెడి సద్గ్రంథమనె
వేదము చదువుట చదివించుట
వినుటయు వినుపించుట ధర్మమనె ॥స్వామి॥

12 సత్యమునే గ్రహియించుచు సతత మ
సత్యము త్యజింపవలెననియె
అనవరతము సత్యమునే బలుకుచు
అనృతము వీడుట మంచిదనె ॥మహాఋషి॥

13 యథాయోగ్యముగ ధర్మయుక్తముగ
అందరు ప్రేమగ మెలగుడనె
ఇందే కల దందరికి సుఖము, ఏ
సందేహము లేదని పలికె ॥అనుడీ॥

14 ప్రపంచమున కుపకారము జేయుటె
ప్రతి ఆర్యునకును ధర్మమనె
శారీరాత్మిక సామాజికహిత
సాధనయే సత్పథమనియె ॥స్వామి॥

15 అవిద్యయను నది నశింపజేయగ
అహర్నిశలు కృషి సలుపుడనె
విద్యను పెంపొందగ జేయుచు భువి
విశ్వఖ్యాతిని బడయుడనె ॥మహాఋషి॥

16 అందరి యున్నతిలో తన యున్నతి
ఉందని నిత్యము దలచుడనె
డెందములో తనయున్నతితోనే
పొందెడి తృప్తియు తగదనియె ॥అనుడీ॥

17 ఎల్లరహితకర నియమ పాలనకు
చెల్లును పరతంత్రత యనియె
సల్లలితములగు స్వహిత కార్యముల
స్వతంత్రులై చరియించుడనె ॥స్వామి॥

18 అపౌరుషేయము వేదంబనుచును
ఆది ఋషులు ప్రవచించిరనె
ఖేద భేదములు తొలగుటకొరకై
వేదమార్గమున నడువుడనె ॥మహాఋషి॥

19 భూజము సర్వము సూక్ష్మరూపమున
బీజమునందున యున్నటుల
విద్యలన్నియును బీజరూపమున
వేదములందున నుండె ననె ॥అనుడీ॥

20 వేదము స్వతఃప్రమాణమగుటచే
వేదము దానె ప్రమాణమనె
పరమఋషులు రచియించిన వాటిని
పరతఃప్రమాణ మని దెలిపె ॥స్వామి॥

21 అగ్నివాయురవ్యంగీరసులను
ఆది ఋషుల యంతస్సులలో
సృష్ట్యాదిని జన కల్యాణమునకు
స్రష్ట వేదముల నిడెననియె ॥మహాఋషి॥

22 మూడు తత్వములు జగద్రచనకు
మూల మనాదు లనంతమనె
జీవేశ్వర ప్రకృతిమయం బిది
ప్రవాహరీతి అనాదియనె ॥అనుడీ॥

23 ఆకారము లేనట్టి ఈశునకు
ఆకారము గల్పించుటచే
లోకమెల్ల అజ్ఞానమయంబై
చీకాకుల పాలయ్యెననె ॥స్వామి॥

24 అచలుడగుట పరమాత్ముడెప్పుడును
అవతారంబుల దాల్చడనె
అవిచారితమగు కల్పనయగు టది
అర్థ రహితమౌ పలుకులనె ॥మహాఋషి॥

25 విగ్రహముల పూజించుచు తిరిగిన
నిగ్రహ శక్తి లభించదనె
ఉగ్రతపము నొనరించక ఈశు, స
మగ్ర లక్షణము దెలియదనె ॥అనుడీ॥

26 జడమూర్తుల పూజించి పామరత
జడబుద్ధులుగా దగదనియె
తడబాటేల స్వయంప్రకాశుడగు
దైవము నెదలో నిల్పుడనె ॥స్వామి॥

27 మనన శీలురై మంచిని బొందుచు
మనుటయె మానవ ధర్మమనె
జ్ఞానమార్గమున నడుచుచు సిరతము
మానవతను గాపాడుడనె ॥మహాఋషి॥

28 పరమేశుని నామము లన్నింటను
పరమనామ మోంకారమనె
ఓంకారోపాసనమే మనుజుల
సంకటముల దొలగించుననె ॥అనుడీ॥

29 రామకృష్ణు లాదర్శముగాగా
రాణించుడి భువిలోననియె
ధీరత కష్టమ్ముల నెదురించుచు
ధరలో విజయము గాంచుడనె ॥స్వామి॥

30 బ్రతికియున్న పితరుల విద్వాంసుల
ప్రతి దినమును పూజించుడనె
చచ్చినవారికి పిండము లొసగుట
పిచ్చితనంబే యగుననియె ॥మహాఋషి॥

31 బొందల పీరుల క్రాసుల పూజలు
కొందలముల పాల్జేయుననె
శుభము గోరితే ఏకేశ్వరుడగు
విభుని గొల్చుటే మేలనియె ॥అనుడీ॥

32 బాలబాలికలు తపోజీవనము
పాటించుచు విద్యల నెల్ల
నేరిచి జగమున జ్ఞాన బోధనలు
నిత్యము జేయగవలెననియె ॥స్వామి॥

33 గురుకులముల స్థాపించి విద్యలను
గరుపవలయు పిల్లలకనియె
నిరుపమానమగు వేదాభ్యాసము
నిరతము జేయుచునుండుడనె ॥మహాఋషి॥

34 వర్ణము గుణకర్మ స్వభావముల
వలననె ఏర్పడునని పలికె
వర్ణాశ్రమధర్మముల నెరపుచు
వర్ధిల్లుటయే శ్రేయమనె ॥అనుడీ॥

35 మతములలో లోపము లుండుటచే
మతముల జోలికి పోకుడనె
హితము గలుగ కోరినచో మనుజులు
బ్రతుకు ధర్మముగ గడుపుడనె ॥స్వామి॥

36 పురాణ్ కిరాన్ ఖురాన్ బొంకులు
నిరాకరించుట భావ్యమనె
సురలై అసురత్వముతో బోరుచు
ధరాతలంబున మనుడనియె ॥మహాఋషి॥

37 ఖురాన బైబిల్ పురాణముల గల
కిరాత బోధలు వినకుడనె
వేదార్థములే సత్యముగావున
విశ్వసించి మెలగుండనియె ॥అనుడీ॥

38 పంచ మహాయజ్ఞములను జేయుచు
పరమార్థము సాధించుడనె
కొంచెపు పనులను జేయుట మానిన
ఇంచుక భయమే యుండదనె ॥స్వామి॥

39 పరమేశుని సద్భక్తి భజించుటె
బ్రహ్మయజ్ఞమని ప్రవచించె
ఔషధి ఘృతముల హవనము జేయుటె
ఔను దేవయజ్ఞమ్మనియె ॥మహఋషి॥

40 తల్లిదండ్రులను భక్తిని గొలచుటె
ధరలో పితృయజ్ఞమ్మనియె
అతిథులైన మహాత్ముల సేవయె
ఆరయగ నరయజ్ఞమ్మనియె ॥అనుడీ॥

41 సర్వజీవులను తనవలె జూచుచు
సతతము హిత మొనరించుడనె
సర్వప్రాణులను ప్రేమించుటయే
నుర్వి భూతయజ్ఞంబనియె ॥స్వామి॥

42 యజ్ఞములో పశువుల బలినిచ్చుట
అజ్ఞుల కుకర్మలేయనియె
విజ్ఞులు యిట్టి కుకర్మల నెప్పుడు
యజ్ఞకర్మయని ఎంచరనె ॥మహఋషి॥

43 స్వార్థులు కొందరు సోమయాజులై
వ్యర్థపు పనులను జేతురనె
వ్యర్థు లౌ వీరిని సన్మానించుట
అర్థ రహితమగునని పలికె ॥అనుడీ॥

44 వేదములకు దుర్వ్యాఖ్యలు జేయుచు
వాదమునకు యత్నింతురనె
కాదని పల్కినవారిని నాస్తిక
వాదులనుచు ఘోషింతురనె ॥స్వామి॥

45 వామ మార్గులే ఈ కుకర్మలను
పామరులై చేయుదురనియె
కామాతురులౌ వీరికి స్వర్గము
ఏ మాత్రము లభియించదనె ॥మహాఋషి॥

46 పంచ మకారములను పాటించెడి
వంచకులగు వారల వినుడీ
పంచకు జేరగనీయ కెప్పుడు
ఉంచవలెను బహుదూర మనె ॥అనుడీ॥

47 మద్యము, మాంసము, మైథున ముద్రలు
మత్స్య భక్షణము చేయుటచే
స్వర్గ సుఖంబులు గలుగగలవనుచు
శ్వపచు లగుచు బోధింతురనె ॥స్వామి॥

48 శిష్టులవలె వేషములను వేయుచు
దుష్ట కర్మలను జేతురనె
భ్రష్టులైన వీరల కుచేష్టలను
శ్రేష్ఠులు ఖండించుదురనియె ॥మహర్షి॥

49 షోడశ సంస్కారములను బొందుచు
మూఢత్వము పోనాడు డనె
మూఢాచారములను వీడనిచో
కీడే తప్పక కలుగుననె ॥అనుడీ॥

50 సత్సంతానము బడయుట కొరకై
ఋతుసమయంబున దంపతులు
గర్భాధానంబను సంస్కారము
సద్భావముతో జేయుడనె ! ॥స్వామి॥

51 పుంసవనము మరి సీమంతంబును
జాతకర్మ యనునవి యెల్ల
స్త్రీమనసుకు సంతసము కలుగుటకు
ప్రేమభావమున జేయుడనె ॥మహర్షి॥

52 నామకరణ నిష్క్రమణము మరి
అన్నప్రాశన శాస్త్రోక్తముగ
కర్ణవేధమును కేశఖండనము
నిర్ణయవిధముగ జేయుడనె ॥అనుడీ॥

53 ఉపనయనము వేదారంభ సమా
వర్తన సంస్కారములను వినుడీ
బాలబాలికల బాగును కోరిన
చాల శ్రద్ధ జరిపించుడనె ॥స్వామి॥

54 వివాహసంస్కారము అన్నిటిలో
విశిష్ట సంస్కారంబనియె
వానప్రస్థము సన్యాసము
అంత్యేష్టి జరుపుటలు తగుననియె ॥మహర్షి॥

55 బాల్య వివాహము మానవజాతికి
బాధాకరమని వచియించె
ప్రౌఢ వివాహమ్ములనే సల్పుచు
ప్రబుద్ధ సంతతి బడయుడనె ॥అనుడీ॥

56 వృద్ధ వివాహము లనునవి మనుజుల
బుద్ధి హీనతకు త్రోవయనె
ఇద్దరిత్రి నవి యవమాన దాస్య
బద్ధుల జేయక విడువవనె ॥స్వామి॥

57 ఆపత్సమయములోన "నియోగం"
బాచరణకు తేదగుననియె
ఆపద్ధర్మము కాదను ద్విజు లిల
ఆపదలకు గురియౌదురనె ॥మహర్షి॥

58 పారతంత్ర్యమును పారద్రోలుటకు
ప్రాణము లొడ్డుటె తగుననియె
సురాజ్యమును నెలకొల్పుట కొరకై
స్వరాజ్య సంపాదన యనియె ॥అనుడీ॥

59 ధర్మమూర్తి నిర్బలుడైనను సరె
తప్పక నతనికి వెరవుడనె
ధర్మహీను డెంతటి బలియైనను
దగిలి యతని నెదురించుడనె ॥స్వామి॥

60 ఆతతాయులను అణచివేయుటే
ఆర్యుల కర్తవ్యంబనియె
భూతలమును స్వర్గముగ మార్చుటకు
చేతనైన కృషి జేయుడనె ॥మహర్షి॥

61 దేశద్రోహుల తరిమివేయుటే
దేశభక్తులకు విధియనియె
ఆశాపాశము ద్రెంచి నిజాయితి
దేశభక్తులై మనుడనియె ॥అనుడీ॥

62 శత్రువులను దునుమాడుట వీరుల
క్షాత్రధర్మమని దెలియుడనె
మిత్రత్వమునకు ద్రోహము జేసిన
కృత్రిములను సరిదిద్దుడనె ॥స్వామి॥

163 దేశ రక్షణకు ప్రజలెల్లరు దృఢ
దీక్షను వహించదగుననియె
దక్షత కలిగిన వారికి ఇల సుఖ
మక్షయమగునని నమ్మడనె ॥మహర్షి॥

164 జీవుల కిల ఏ హాని యొనర్చక
జీవించుటయే ధర్మమనె
పావనమైన సమాజసేవచే
జీవితమంతయు నడుపుడనె ॥అనుడీ॥

165 పశుసంపద గాపాడుట మానవ
పరమ ధర్మముగ నెంచుడనె
వసుధలో సంపద బెంచుటకొరకై
పశువుల క్షేమము గోరుడనె ॥స్వామి॥

166 గోపాలకులై గోవుల బెంచుచు
గో క్షీరములను గ్రోలుడనె
'గో కరుణానిధి' వ్రాసి యెల్లరకు
గో లాభములను బోధించె ॥మహర్షి॥

167 మద్య మాంసముల సేవించుట అది
మానవధర్మము గాదనియె
మత్తు పదార్థములను వాడినచో
మనుజులు మతిచెడి పోదురనె ॥అనుడీ॥

68 కుల మత భేదంబుల వీడొకపై
మెలగుట సుఖకరమగుననియె
కలకాలము సుఖముగ మననెంచిన
ఛల కపటములను వదలుడనె ॥స్వామి॥

69 న్యాయమార్గమున గూర్చిన సంపద
భోగించుటయే తగుననియె
"ఇద న్న మమ"యను సూక్తిని మదిలో
సదా స్మరించుచు నుండుడనె ॥మహర్షి॥

70 ఇరుగు పొరుగు వారలు మనవారని
కరుణ జూపి కాపాడుడనె
నిరుపేదల దయజూచుచు నిరతము
వరలుచుండుటే శుభమనియె ॥అనుడీ॥

71 అనాథులకు తగు నాశ్రయ మొసగుచు
నాదరించుటే యుక్తమనె
వీడి దైన్య జీవనమును నెప్పుడు
విశ్వములో జీవించుడనె ॥స్వామి॥

72 దేశ వస్తువుల నుపయోగించుచు
దేశోద్ధరణకు బూనుడనె
దేశ దరిద్రము బాపుచు శ్రమచే
దేశ కోశమును బెంచుమనె ॥మహర్షి॥

73 అంటరానితనమును నిర్మూలము
వెంటనె జేయుట తగుననియె
అందరు మానవు లోకేఈశ్వరుని
అమృతపుత్రులని దెలియుడనె ॥అనుడీ॥

74 ఫలితజ్యోస్య మసత్యము గావున
పౌరుష శక్తిని బెంచుడనె
పూర్వజన్మకృత కర్మఫలంబులె
భువి సుఖదుఃఖము లొసగుననె ॥స్వామి॥

75 భూతప్రేతము లేమియు లేవని
భూతలమందున చాటుడనె
మానవజాతికి ధైర్యము గూర్చుట
మాతలందరికి విధియనియె ॥మహర్షి॥

76 మంత్రముచే ప్రజలను జంపుదుమను
మాయకులను దండించుడనె
మాంత్రికులేమియు చేయజాలరని
మానవులకు బోధించుడనె ॥అనుడీ॥

77 తీర్థ యాత్రలకు బోవ పాపములు
తీరుననుట భ్రమయే యనియె
సత్సంగము స్వాధ్యాయము యజ్ఞము
సంధ్యయె నిజమగు తీర్థమనె ॥స్వామి॥

78 బాధ గురువుల దరిజేరక సద్
బోధ గురువులను వెదకుడనె
ఈ ధర సుఖముల బడయ దలచితె
వేదవిధుల పాటించుడనె ॥మహాఋషి॥

79 బ్రహ్మచర్య వ్రతమును పాటించుచు
బ్రహ్మను దెలియగ బూనుడనె
ఇమ్మహి యోగాభ్యాసముచేతనె
బ్రహ్మను దెలియుట సాధ్యమనె ॥అనుడీ॥

80 అన్ని పండుగలు నుత్సాహముతో
అందరు సలుపుచు నుండుడనె
ఉన్న దానితో తృప్తిని బొందుచు
ఉన్ననె సుఖము లభించుననె ॥స్వామి॥

81 మహిళామణులకు మాన్యత నిచ్చుచు
మంచి దృష్టితో చూడుడనె
మహిళలె మానవ నిర్మాణమునకు
మహితశక్తి గలవారనియె ॥మహాఋషి॥

82 సీతా సావిత్రీ దమయంతులు
స్త్రీజాతికి నాదర్శమనె
స్త్రీల మహోన్నతదశయే జాతికి
మేలొనగూర్చుట నిక్కమనె ॥అనుడీ॥

83 వేదము స్త్రీ శూద్రాదులు చదువగ
వేదాదేశము గలదనియె
కాదనువారల మాటలు నమ్మక
వేదము లెల్లరు చదువుడనె ॥స్వామి॥

84 ధర్మాచరణము చేయువారినే
ధర నార్యులుగా నెంచుడనె
ధర్మస్థాపన జేయుట కొరకై
కర్మవీరులై వెలయుడనె ॥మహాఋషి॥

85 హేతువునకు నిలిచెడి సిద్ధాంతము
వేదసమ్మతమ్మని నుడివె
హేతువునకు నిలువని సిద్ధాంతము
వేదసమ్మతము గాదనియె ॥అనుడీ॥

86 త్యాగులైన యోగుల మాటలు విన
బాగుపడుదురని బోధించె
భోగలాలసుల మాటలు వినుచో
రోగములకు గురి యగుదురనె ॥స్వామి॥

87 పండితులకు సత్కారము జేయుచు
నుండిన లాభము గలుగుననె
దండిగ జ్ఞానోపార్జన జేయగ
నుండవలయు వినయంబనియె ॥మహాఋషి॥

88 అతిథుల నెప్పుడు సత్కరించుచు
ఆశీర్వాదము బొందుడనె
సత్యసంధులగు సన్యాసుల నిల
సన్మానించుచు వరలుడనె ॥అనుడీ॥

89 బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులు
ఇమ్మహి మైత్రిని మెలగుడనె
ఈ తీరున నిహపరసౌఖ్యమ్ముల
నిందు నందు పొందుదురనియె ॥స్వామి॥

90 ప్రజాక్షేమకర శాసనములనె
నిజాయితిగ పాలించుడనె
అజాతశత్రువు లగుచు శాసకుల
నిజాయితిగ జీవించమనె ॥మహాఋషి॥

91 దుష్టశక్తు లెంతటివైననుసరె
కష్ట మనక పడగొట్టుడనె
శ్రేష్ఠంబైన ప్రభుత్వము నిలుపుట
శిష్టజనుల కర్తవ్యమనె ॥అనుడీ॥

92 భాషావాదము లన్నియు వీడుచు
భావసమైక్యత బొందుడనె
రాగద్వేషము లన్నియు మరచుచు
రంజితమతులై యుండుడనె ॥స్వామి॥

93 ఆర్యభాషనే రాష్ట్రభాషగ
ఆదరించుటే మంచిదనె
అన్నిప్రాంతములవారలు నేర్వగ
నతిసులభం బీ భాషయనె ॥మహాఋషి॥

94 సంస్కృతభాషను సర్వప్రపంచపు
సాధికారభాషను జేయన్
సార్వభౌమ సామ్రాజ్య స్థాపన
సర్వు లేకమై జేయుడనె ॥అనుడీ॥

95 సర్వవిశ్వమున కొకే ప్రభుత్వము
సత్వరముగ నిర్మించుడనె
సర్వమానవుల నార్యుల జేయగ
నిర్విరామకృషి సలుపుడనె ॥స్వామి॥

96 ఉర్విలోన సుఖ మొందదలంచిన
సర్వులక్షేమము గోరుడనె
సర్వజనులు మిత్రత్వభావమున
నుర్వినుండ యత్నించుడనె ॥మహాఋషి॥

97 ఒకే మంత్రమగు ఓంకారమునే
ఒప్పుగ ధ్యానము చేయుడనె
అన్యోన్యంబుగ నభినందించగ
అందరు "నమస్తే" అనుడనియె ॥అనుడీ॥

98 ఎవరైనను మీరెవరని అడిగిన
అవని మేము ఆర్యుల మనుచు
అతిశయముగ నేమాత్రము జంకక
ఆహ్లాదముతో తెల్పుడనె ॥స్వామి॥

99 యమనియమాదుల నాచరించుచు
అఖిలేశ్వరు కృప బడయుడనె
క్రమము దప్పి చరియించిన మనుజులు
తమములోన బడి చెడుదురనె ॥మహాఋషి॥

100 మానవజన్మము మరిమరి రాదని
మదిని దలంచుట భావ్యమనె
జ్ఞానమార్గమున నడిచి తరించుట
మానవకర్తవ్యంబనియె ॥అనుడీ॥

101 అధికారము గలదని చెడుజేసిన
అధఃపతనమె వారికనె
విధినిర్వహణ మొనర్చెడివారిని
విశ్వవిభుడు దయ జూచుననె ॥స్వామి॥

102 ఎన్ని కష్టములు ఎదురైననుసరె
ఉన్నతపథమును విడకుడనె
అన్ని కష్టముల నా పరమాత్ముడు
తిన్నగ దూరము జేయుననె ॥మహాఋషి॥

103 ఆర్యపండితుల నొకచో జేరిచి
ఆర్యసమాజము స్థాపించె
ఆర్యులగుచు విశ్వము నంతట నిజ
ఆర్య ధర్మ బోధించుడనె ॥అనుడీ॥

104 ధృతియు క్షమయు నస్తేయము దమమును
శౌచము, నింద్రియ నిగ్రహము
ధీ, విద్యా, అక్రోధము, సత్యము
ధర్మ లక్షణములని తెలిపె ॥స్వామి॥

105 వేదములకు నిజమైన అర్థమును
ఏ విధముగ జేయగదగునో
ఆ విధమును దెలుపుటకై ఋగ్వే
దాదిభాష్య భూమిక వ్రాసె ॥మహాఋషి॥

106 మనుజులెల్ల సోదరభావముతో
మంచిగ వేదములను జదివి
మననశీలురై మంచిని గ్రహించి
మనుటయె మానవ ధర్మమనె ॥అనుడీ॥

107 విశ్వమంతటికి వేద మొక్కటే
విశ్వసించదగు జ్ఞానమనె
విశ్వమానవుల కల్యాణమునకు
విహితవిధుల నిది తెలుపుననె ॥స్వామి॥

108 మంత్రిప్రగడకు వేదమార్గమే
మంచిమార్గమని బోధించె
మానవజన్మల తరింపజేయగ
మహి దయానందు దేతెంచె ॥మహాఋషి॥



స్వస్తిప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీంమహీశాః
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తా స్సుఖినో భవంతు

సర్వే భవంతు సుఖినః
సర్వేసంతు నిరామయాః
సర్వే భద్రాణి పశ్యంతు
మాకశ్చిత్ దుఃఖభాగ్భవేత్॥

ఓం ద్యౌః శాంతిః అంతరిక్షగ్ం శాంతిః
పృథివీశాంతిః ఆపఃశాంతిః ఓషధయః శాంతిః
వనస్పతయః శాంతిః విశ్వదేవా శాంతిః
బ్రహ్మశాంతిః సర్వగ్ం శాంతిః
శాంతిరేవ శాంతిః సామా శాంతిరేధి

ఓం శాంతిః శాంతిః శాంతిః



# ఈశ్వరస్తుతి ప్రార్థనోపాసనలు

శంకరాభరణము ౧ ఆది

ఓం నమోనమో ఓం నమోనమో ఓం
నమో నమస్తే నమో నమః
ఓం నమో నమో ఓం నమో నమో ఓం
నమో నమస్తే నమో నమః ॥ఓం॥

ఓం నమో ఓం గాయత్రీ మాతా
నమో నమో ఓం నమో నమః
ఓం నమో ఓం సావిత్రీ మాతా
నమో నమో ఓం నమో నమః ॥ఓం॥

ఓం నమో నమో నమ ఓం భూః
నమో నమో ఓం నమో నమః
ఓం నమో నమో నమ ఓం భువః
నమో నమో ఓం నమో నమః ॥ఓం॥

ఓం నమో నమో నమ ఓం స్వాః
నమో నమో ఓం నమో నమః
ఓం నమో నమో నమ ఓం మహాః
నమో నమో ఓం నమో నమహాః ॥ఓం॥

ఓం నమో నమో నమ ఓం జనః
నమో నమో ఓం నమో నమః
ఓం నమో నమో నమ ఓం తపః
నమో నమో ఓం నమో నమః ॥ఓం॥

ఓం నమో నమో నమ ఓం సత్యం
నమో నమో ఓం నమో నమః
ఓం నమో నమో నమ ఓం ఖం బ్రహ్మ
నమో నమో ఓం నమో నమః ॥ఓం॥

రేగుప్తి ౨ త్రిశ్రజాతి

మాతా గాయత్రీ ధీమంతులుగా మము జేయుమ
మాతా సావిత్రీ ధీమంతులుగా మము జేయుమ
పాతకముల బడనీయక పరమ పథంబున నడుపుమ
పాతకముల బడనీయక భవ్య మార్గమున నడుపుమ ॥మాతా॥

కన్న తల్లిరో నిన్నిక ఎన్నటికిని మరువమమ్మ
ఎన్ని కష్టములు రానీ నిన్నే మది గొలుతుమమ్మ ॥మాతా॥

ఇన్ని నాళ్లు నిన్ను మరచి ఎన్నో యిడుముల బడితిమి
నిన్ను దక్క పేరిని మది సన్నుతింప బోమమ్మ ॥మాతా॥

జడమూర్తుల కడిగి కడిగి జడబుద్ధులమైతిమమ్మ
పెడమార్గము ద్రొక్కి మేము బడుగులమై చెడితిమమ్మ ॥మాతా॥

జగమంతట నిండియున్న జననీ నిను దెలియలేక
జడములె నీ వనుచు గొలిచి కడుయిడుముల బడితిమమ్మ ॥మాతా॥

అంతరంగమున నిను గను టెంత సులభమో దెలియక
ఎంతగనో శ్రమలజెంది వంతలపాలైతిమమ్మ ॥మాతా॥

యోగులైనవారలె నిను బాగుగ దెలియగ గలరట
భోగలాలసులము మమ్ము యోగమార్గమున నడుపుమ ॥మాతా॥

నీ సృష్టి రహస్యములను నిపుణులు శోధించి తుదకు
నీ మహిమ అపార మనెడి నిజమును గనుగొనిరమ్మ ॥మాతా॥

నీలో గల శక్తులను బేలలమై దెలియలేక
కాలము వ్యర్థముగ గడిపి చాలగ చెడిపోతిమమ్మ ॥మాతా॥

నీకృపాపాత్రు లెల్ల నిఖిలలోకవంద్యులైరి
నీ కరుణ యపారమనుచు నీ భక్తులు చాటిరమ్మ ॥మాతా॥

నిన్ను దెలిసికొనినవారు నిజముగ సుఖియించినారు
ఖిన్నత దూరంబుజేసి యెన్నో శుభముల బడసి ॥మాతా॥

పంచతత్వ నిధివమ్మ పలుశక్తుల జననివమ్మ
పాపలము మే మమ్మ పాలింపగ చేకొమ్మ ॥మాతా॥

వెంకటార్య వినుతవమ్మ సంకటముల బాపుమమ్మ
శంకవీడి గొలుతుమమ్మ జంకని ఎద మాకిమ్మ ॥మాతా॥

చక్రవాకం ౹ ఆది. తాళం.

ఓం భూః ఓం భువః ఓం స్వః ఓం ఓం
ఓం ఓం ఓం ఓం ఓం ఓం ఓం ఓం ॥ఓం॥

ఎందెందు వెదకి చూడ అందందే కలవు నీ
సందేశమే యగు నీ సౌందర్య జగము ప్రభో ॥ఓం॥

మందమతులు నిన్ను మరచి యున్నారు
కొందలముల నెన్నో బొందుచున్నారు ॥ఓం॥

నీవొసంగిన వన్ని నిరతము దినుచు
కావరమున నిన్ను గానకున్నారు ॥ఓం॥

కర్మఫలము నొసగు కరుణాళు నిన్ను
దుర్మతులు దెలియక తూల నాడుదురు ॥ఓం॥

నిర్మలహృది మేము నిన్ను గొల్చెదము
ధర్మబుద్ధి నొసంగి దయ చూడు మమ్ము ॥ఓం॥

వెంకటార్యార్చిత వేడితిమి నిన్ను
సంకటముల బాపి సత్సంగ మిమ్ము ॥ఓం॥

భూపాళ రాగం ౨ రూపక తాళం.

ఏల దయ రాదుర పరాత్పరా నీ
కేల దయ రాదుర పరాత్పరా ॥ఏలదయ॥

చాలు చాలు ఈ బాధలు, తాళజాలలేము మేము
బాలబాలికలము మమ్ము ఏలుకొనగ వేగమె నీ ॥కే॥

ఆపద్బాంధవుడవనుచు తాపసులెల్లరు నుడివిరి
ప్రాపు గోరితిమి నీదుపాపల మము గాపాడగ ॥ఏ॥

ధ్రువ ప్రహ్లాదాదులనెడి భువి భక్తుల కెందరికో
భవదీయాజ్ఞలను మెలగ భవబంధము బాపితివట ॥ఏ॥

పాపచింత లేవి మా మది కాపురంబు సేయకుండ
ఆపదుద్ధారకుడ వీవే ఆపగల సమర్థుడవట ॥ఏ॥

మంత్రిప్రగడ వినుత మము నేలగ తడవేల
స్వాంతమందు నిను గొలుతుము చింతలెల్ల బాపగ నీ॥కే॥

భైరవి ఆట. తాళం.

జీవిత మిది వృథా బోనీయక
స్మరియించు ఓం స్మరియించు ఓం
ఓం సుఖములకెల్ల మూలము
జీవితము జీవితానందము
జీవితము జీవితాధారము
ప్రేమించు ఓంనె నిరతము, ప్రేమించు ఓంనె సతతము
స్మరియించు ఓం స్మరియించు ఓం ॥జీవిత॥

దేహము శాశ్వతము గాదులే
భస్మమై యిది అంతమౌనులే
ఓం.... కృతంస్మర క్లిబెస్మర క్రతోస్మర ॥జీవిత॥

ఆశాపాశముల త్రెంచుకో
మోసవృత్తులనెల్ల మానుకో
ఈశుని నెద గొల్వ నేర్చుకో
స్మరియించు ఓం స్మరియించు ఓం ॥జీవిత॥

దేశద్రోహపు చింత మానుకో
దేశమును ప్రేమించ బూనుకో
విశ్వమును నీదిగ జేసికో
స్మరియించు ఓం స్మరియించు ఓం ॥జీవిత॥

కర్మజేయు జన్మమిదియేనులే
ధర్మకర్మల నెల్ల జేయలే
ధర్మరహితుడ వగుటు తగదులే
స్మరియించు ఓం స్మరియించు ఓం ॥జీవిత॥

మనసు చంచలతను నాపుకో
మానవతయన దెలిసి నడుచుకో
మనో మాలిన్యము గడుగుకో
స్మరియించు ఓం స్మరియించు ఓం ॥జీవిత॥

ఓంనె సహచరుని జేసికో
ఓంనె హృది నెపుడు నిల్పుకో
క్షేమ మిందేయని తలచుకో
స్మరియించు ఓం స్మరియించు ఓం ॥జీవిత॥

ఆర్యులవలె జీవించ నేర్చుకో
ఆర్యుల నందరి చేయ బూనుకో
ధైర్యముతో పనుల నేరవేర్చుకో
స్మరియించు ఓం స్మరియించు ఓం ॥జీవిత॥

అష్టాంగయోగ మలవరుచుకో
కష్టించి నిను నీవు దెలసికో
స్రష్ట నపుడె తెలియ బూనుకో
స్మరియించు ఓం స్మరియించు ఓం ॥జీవిత॥

మరి మరి నరజన్మ రాదులే
మంత్రిప్రగ్గడ బోధ వినగలే
మంచి జేయ మంచి గలుగులే
స్మరియించు ఓం స్మరియించు ఓం ॥జీవిత॥

*రాగం చక్రవాకం* ౬ *తాళం ఆది*

అంతా నీ మహిమే హే భగవన్ ॥అంతా॥

అంతులేని నీ మహిమల తెలియగ
ఎంతవారలము మేమీ భువిలో ॥అం॥

ఎంత విచిత్రముగా సృజించితివి
వింతగొలుపు మాశరీరాంగముల
ఎంతగ యోచించిన తెలియదు నీ
వెంత మహిమ గలవాడవొ తండ్రీ ॥అం॥

ఎటు మా చూపులు పోవుచుండునో
అటు నీ మహిమలె గానుపించును
ఎటు మా చెవులవి యొగ్గుచుండునో
అటు నీ మధురస్వరంబులె వినబడు ॥అం॥

నీ వెదజల్లు సుగంధములెల్లను
జీవితమంత సుగంధము జేయును
నీ వొనగూర్చిన మధుర రసములను
జీవకోటి రుచి జూచి తరించును ॥అం॥

మలయమారుతము వీవజేసి మా
మృదుత్వగింద్రియమునకు సుఖమొసగుచు
మరుపురాని హాయిని చేకూర్తువు
మహాదేవ నీదయ యేమనవలె ॥అం॥

గగనమండలములో విచరించెడి
నిగనిగమను నక్షత్రాలెల్లను
అగణితముగ నెటు సృజించితో ప్రభు
తగుబుద్ధిని యిడి తెలియగ జేయుము ॥అం॥

ఉద్భిజస్వేదజ అండజరాయుజ
అద్భుత సృష్టిస్థితిలయముల గని
వృద్ధులైన జ్ఞానులె విస్మితులై
ఎద్దియు దోచక మౌనము దాల్చిరి ॥అం॥

మంత్రిప్రగడను దయతో నేలిన
శాంతి ప్రదాతా మము దయజూడుము
వింతగొలుపు నీమహిమల దెలుపుచు
చింతలు మము విడిపోవగ జేయుము ॥అం॥

రాగం మోహన ౭ తాళం ఆది

ప్రభు నా జీవితము ఓ ప్రభు నా జీవితము
ప్రాణికోటి కుపకరింప జేయుమ ॥ప్ర॥

ఇలలోనే నొక దీపికనై ప్రభు
కలతమసమ్మును కడజిమ్ముటకై ॥ప్ర॥

దుర్గుణజాలము దూరముచేయగ
సద్గుణ సౌరభ వైభవ మొసగి ॥ప్ర॥

అజ్ఞానము బరిమార్చగ నన్నొక
ప్రాజ్ఞునిగా యిల రూపొందించుమ ॥ప్ర॥

దారిద్ర్యమ్మును బాప ధనదునై
చేరి పేదదరి సేవలజేయగ ॥ప్ర॥

వృద్ధుల కిలలో నూతనకర్రనై
శ్రద్ధతోడ సేవించి తరించగ ॥ప్ర॥

మంత్రిప్రగ్గడ వినుతా నన్నొక
మంచిమార్గమున నడుప బూనుమ ॥ప్ర॥

*రాగం చక్రవాకం ౦ తాళం ఆది.*

భజించవే మనసా (ఓంను) దేవుని ॥భ॥

భుజించు శుభ సమయంబున మరువక ॥భ॥

పరబ్రహ్మ సమమగు నీయన్నము
పచనంబై అమృతముగా మారును ॥భ॥

ప్రాణిమాత్రులకు జీవన మొసగును
పారద్రోలి దుఃఖము, సుఖమొసగును ॥భ॥

ఉదరఖాద్యమని ఎంచి తినకుము
ముదమొసగెడి సవనంబని యెంచుము ॥భ॥

మంత్రిప్రగడను దయతో నేలిన
అంతర్యామిని అహర్నిశలు మది ॥భ॥

రాగం చక్రవాకం — ఆదితాళం.

పతితుడవైతివిరా నరుడా ॥పతి॥

పతితపావనుని భజనము మాని ॥పతి॥

పరమాత్ముని బడయగ నీకొసగిన
పంచకోశమగు దివ్యదేహమును
కొంచెపు పనులను జేసి జీవితము
వంచనలకు గురిజేసితివరెరే ॥పతి॥

పంచకోశ సోపానము లెక్కగ
వంచి దేహమును, యోగము నేరిచి
అంచిత భక్తిని ఈశుని దలచుచు
మంచి మార్గమున నడిచి తరించుము ॥పతి॥

అభక్ష్యాహారంబును వీడి
అక్రమ పానీయంబుల మాని
అన్నకోశమును సక్రమపరచి
ఆరోగ్యంబును బొంది సుఖించుము ॥పతి॥

ప్రాణకోశమును బాగుపరచుటకు
ప్రాణవాయువును బీల్చుచు సతతము
ప్రాణశక్తి నభివృద్ధిపరచుకొని
త్రాణగలిగి భువి వరలుచు నుండుము ॥పతి॥

మంచి మంచి సంకల్పమ్ముల మది
నుంచి మనోమయకోశము బెంచుము
కొంచెపు కోర్కెలువీడి చరించిన
ఎంచరాని సౌఖ్యము లభియించును ॥పతి॥

సుజ్ఞానుల సత్సంగము జేయుచు
అజ్ఞానంబును బారద్రోలుము
విజ్ఞానం బభివృద్ధి నొంది భువి
ప్రజ్ఞావంతుడ వౌదువు నిజము ॥పతి॥

అరిషడ్వర్గములను జయించగ
అంతరంగమున అహర్నిశంబులు
అహమువీడి గాయత్రీ మంత్రము
ఆనందంబును బడయ జపించుము ॥పతి॥

మంత్రిప్రగ్గడ మహోపదేశము
మానక పాటించినచో వినుము
ఇహపరముల సాధింతువు నిజము
అహంభావమిది కాదు నమ్ముము ॥పతి॥

*ఉదయ చంద్రిక* ౧౦ *ఆదితాళం*

ఓం; ఓం; అనాలి ఓం; ఓం; అనాలి
సంతసముగ నెపుడుండాలి
జీవితమిది వున్నంతవరకు
ఓమ్‌నె జపించుచుండాలి॥ ॥ఓం॥

కష్టములెన్నైనను రానీ
దృష్టి ఓమ్‌పై నుండాలి
తుష్టిని పుష్టిని బొందదలచితే
నిష్ఠగ ఓం జపించాలి ॥ఓం॥

బాలబాలికలు యువతీయువకులు
మేలుగలుగ వృద్ధులు స్త్రీపురుషులు
నిల్చొని కూర్చొని పరుండి మేల్కొని
నడుచుచు ఓమ్ స్మరించాలి ॥ఓం॥

ఉదయము సాయం సంధ్యహవనముల
శ్రద్ధగ జేయుచు నుండాలి
తల్లిదండ్రి అతిథుల సేవించుచు
దయతో ప్రాణుల జూడాలి ॥ఓం॥

ఆయువు ఇది క్షీణించుట నిజము
మేలుపొంద దలచినచో వినుము
దాన ధర్మముల జేయుచు సతతము
తను మన ధనముల నొసగాలి ॥ఓం॥

ఏ ఘడియకు ఏమగునో తెలియదు
గురక గొట్టి ఈ జీవుడు దేహము
విడిచి పోవు ఒక దినమున తప్పదు
అని మది ఓమ్ స్మరించాలి ॥ఓం॥

వేదప్రచారము పుర పట్నములను
పల్లెపల్లెలో జేయాలి
సత్యసాధనకు మనుజులెల్లరును
సదా ముందడుగు వేయాలి ॥ఓం॥

దుర్గుణంబులను దూరముజేసి
సద్గుణరాసిని బెంచాలి
విజ్ఞుల సత్సాంగత్యము వలననె
అజ్ఞానము బోద్రోలాలి ॥ఓం॥

మంత్రిప్రగ్గడ బోధను మరువక
మంచిమార్గమున నడవాలి
పంచన జేరిన వారల దయతో
మంచిగ జూచుచు నుండాలి ॥ఓం॥

శివరంజని ౧౧ ఏకతాళం:-

ఈశా జగదీశా సర్వేశా మము గాపాడుమ
ఆశాపాశము ద్రెంపి, దేశభక్తి మది నింపి ॥ఈ॥

నినుదెలియగ మా తరమా, కనికరమున మము నేలుమ
కనజాలము నీమహిమ, కరుణామయ దయ గనుమ ॥ఈ॥

శత్రువులను బరిమార్చగ. క్షాత్రశక్తి మా కొసగుమ
భక్తి నిన్ను గొలుతుము ధీశక్తిని ప్రేరేపించుమ ॥ఈ॥

కదనరంగమున ధైర్యము, వదలక వైరులను ద్రుంచు
హృదయము దయజేసి మాకు, ముదము జగతి
చేకూర్చుమ ॥ఈ॥

మంత్రిప్రగ్గడ వినుతా, మాదురితములను బాపుమ
భద్రగుణంబుల నొసంగి, నిద్రనుండి మేల్కొల్పుమ ॥ఈ॥

మోహన ౧౨ ఆదితాళం

మ్రోగించరా విజయభేరి సోదరా
మ్రోగించరా విజయభేరి ॥మ్రో॥

వీరుడా మ్రోగించు విజయభేరి నేడె
క్రూరులౌ వారి కిల గుండెలల్లాడగా ॥మ్రో॥

కపటులై మనవారి కబళించజూచుటకు
కారణం బగు వారి కాయాలు కంపింప ॥మ్రో॥

భరతవీరుల శౌర్యపటిమ లోకమెరుంగ
చెట్ట దైత్యులగుండె, చెదిరి గడగడలాడ ॥మ్రో॥

విజయభేరీ మ్రోత, విజయంబు మనదనన్
కుజనులౌ దానవుల భుజదర్ప మణగగా ॥మ్రో॥

శ్రీరాగం ౧౩ ఆదితాళం

ప్రతిన జేసెద నేను ప్రతిన జేసెద ॥ప్ర॥

ఎవరినైనగాని నేను ఎట్టికష్టముల బెట్టక
ఎరిగినంతవరకు సతము ఎంతో దయజూతునని ॥ప్ర॥

ప్రొద్దుననే లేచి నేను ఒద్దికతో నీశు దలచి
పెద్దలకు "నమస్తే"యని శ్రద్ధతోడ ఫల్కెదనని ॥ప్ర॥

కాలకృత్యముల నొనర్చి కసరత్తును జేసి పిదప
స్నానము సంధ్యయు హవనము సక్రమముగజేయుదునని ॥ప్ర॥

ఇంటిలోన నేవస్తువు నెటనుంచగ సుకరమగునొ
అటులనె నేనుంచుచు మరి అంద దుంచునటుల జేయ ॥ప్ర॥

యాత్ర జేయునపుడు విమానంబు, రైలు, బస్సు, నావ
లెక్కెనపుడు త్రొక్కికొనక నే నిలుతును వరుసననుచు ॥ప్ర॥

మన ప్రభుత్వ నియమములకు మాన్యత నిచ్చుచు వానికి
వ్యతిరేకతతో నడవక సతతము పాలింతుననుచు ॥ప్ర॥

ఏను నడచునపుడుగాని ఎడ్లబండి, సైకిళ్ళను
నడుపునపుడుగాని నేను ఎడమవైపు తప్పననుచు ॥ప్ర॥

బావిచెంత మురికిజేయ బాటలలో ఉమ్మివేయ
పరిశుద్ధిగ నుండి యితర ప్రజల నుండజేతుననుచు ॥ప్ర॥

పదుగురుగల చోటులలో పరువుగ మెలగుచు నిరతము
పరహితమతి నొచు దయను పతితుల ప్రేమింతు ననుచు ॥ప్ర॥

ఇరుగుపొరుగు వారితోడ హితవుగ మెలగుచు నామది
కరుణామయు మరువక శుభకార్యములను జేతు ననుచు॥ ప్ర॥

సద్గురు హితబోధల విని, దుర్గుణముల విడనాడుచు
సద్గుణముల సంగ్రహించి, సద్గతి సాధింతుననుచు ॥ప్ర॥

దేశభక్తి గలిగి నేను, దేశోన్నతికై సతతము
దేశ వస్తువుల వాడుచు దేశ శ్రీల బెంచెదనని ॥ప్ర॥

సంఘ దురాచారములను సమయజేసి యెల్లరకును
సంక్షేమము గలుగజేయ, సదా పాటుబడెద ననుచు ॥ప్ర॥

అక్షరాస్యులను జేయగ, అజ్ఞానంబును బాపగ
ఆనందము నందుకొనగ, అందఱ మేల్కొలిపెదనని ॥ప్ర॥

దేశమునకు ద్రోహచింత జేసెడి మూర్ఖుల నెల్లర
నాశన మొనరింప నేను నడుముగట్టి నడుతు ననుచు ॥ప్ర॥

మంత్రిప్రగ్గడ హితవుల మంచిగ పాటించి భువిని
మంచి జీవనంబు గడిపి మించుకీర్తి బడిసెదనని ॥ప్ర॥

రాగం మాల్‌కౌన్ ౧౪ ఆదితాళం

చేయుము ప్రభు! త్రిభువనముల; శాంతి ॥చే॥

1. జలస్థల గగనంబులలో శాంతి
అగ్ని మరియు వాయువులో శాంతి
ఓషధివనస్పతివనముల; శాంతి
జీవమాత్రుల మనముల; శాంతి ॥చేయు॥

2. బ్రాహ్మణవాక్కుల నుండుత; శాంతి
క్షత్రియులకు భుజములలో శాంతి
వైశ్యుల కగుత యూరువులలో శాంతి
శూద్రులకుండుత పదముల; శాంతి ॥చేయు॥

3. అన్న వస్త్రముల నుండుత; శాంతి
ధనపతి మరి నిర్ధనులలో శాంతి
కలయికలోపల నుండుత; శాంతి
ప్రకృతియొక్క అణువణువున; శాంతి ॥చేయు॥

మోహన రాగం ౧౫ ఆదితాళం

కరుణరాద మాపై ఓ ప్రభు ॥క॥

1. కరుణానిధివని శరణుజొచ్చితిమి
వరములొసగి భక్తుల మముబ్రోవగ ॥క॥

2. దురితము లెల్లను దూరపరచి నీ
వరకరుణామృత వర్షము గురియగ ॥క॥

3. తాపత్రయముల బాపి వేగమే
కాపాడగరాదా నీ పాపల ॥క॥

4. అజ్ఞానంబును బోనడంచి కడు
సుజ్ఞానామృతమును మాకొసగగ ॥క॥

5. దుష్టత్వము నిల దొలగజేసి మా
కష్టము లెల్లను కడతేర్చంగా ॥క॥

హిందూస్తాని తోడి ౧౬ ఆదితాళం

1. మాదుకోర్కె యిదే ఓ ప్రాణప్రభు
నీదు నామామృతము గ్రోల దలపిమ్ము
నీదు నామామృతము గ్రోల దలపిమ్ము
మాదు దుర్గుణములనెల్ల బోజిమ్ము ॥మా॥

2. కష్టము లెన్నేనియు రానిమ్ము
శిష్టులవలె సహించ క్షమనిమ్ము
దుష్టుల మదమణచగ బలమిమ్ము
స్పష్టముగ సత్యము బలుక ధృతినిమ్ము ॥మా॥

3. ఉన్నతమగు జ్ఞానమునో ఈశా
క్రన్నన మాకొసగుమో సర్వేశా
ఎన్నిడుములు రానీ జగదీశా
నిన్నెన్నడు మరువమో పరమేశా ॥మా॥

4. సర్వస్వము నీవని నమ్మితిమి
గర్వము విడి నిను ప్రార్థించితిమి
సర్వేశ్వర నీదు దయానిధిని
సర్వము గురిపింపుము మాపైని ॥మా॥

మోహనరాగం ౧౭ ఆటతాళం

1. ఈశు డనగా నేమిటో పర
మేశు డనగా నేమిటో
లేశమాత్రము తెలియకుండిరి
దేశమున ప్రజలెందరో ॥ఈశ॥

2. మందిరమ్ముల విగ్రహములను
మస్జిదులలో వట్టి రాళ్ళను
పాదిరీలగుడుల శిలువను
పామరత కడు మ్రొక్కుచుండిరి ॥ఈశ॥

3. జగమునంతట నిండియుండిన
జగత్పతినే మరచిపోయిరి
కాలమంతయు వ్యర్థపరచుచు
బేలలై చెడిపోవుచుండిరి ॥ఈశ॥

4. చావుపుట్టుక లేనివానికి
సర్వమును మనకిచ్చువానికి
ఆకలే లేనట్టివానికి
అన్నపానము లొసగుచుండిరి ॥ఈ॥

5. యోగమార్గము మరచిపోయిరి
భోగమను వలలోన జిక్కిరి
త్యాగభావము విడిచివేసిరి
రాగద్వేషాదులను బెంచిరి ॥ఈ॥

6. అక్కటా గుడిలోని బొమ్మకు
తిక్కతనమున మ్రొక్కుచుండిరి
తాము యెటులో వాని నటులే
తలచి అజ్ఞత చెడుచు నుండిరి ॥ఈ॥

7. ఒక్క దేవుని గొలువమానిరి
పెక్కు దేవతలను సృజించిరి
చిక్కులెన్నియొ దెచ్చిపెట్టిరి
దిక్కు తోచక దిరుగుచుండిరి ॥ఈ॥

8. మనుజులందరు ఒక్కటేయను
మాట బొత్తిగ మరచిపోయిరి
జ్ఞానహీనపు పనులు జేయుచు
మానవత్వము కోలుపోయిరి ॥ఈ॥

9. దేవతలకై పోబలులు ఐఒఒలని
జీవులను హింసించుచుండిరి
పావనంబగు భరతభూమిని
పాపకూపముగా నొనర్చిరి ॥ఈ॥

10. సృష్టి స్థితిలయములకు కారణ
మెట్టి శక్తి గలదో దానినె
గట్టిగా పరమాత్మయని మన
శ్రేష్ఠులెల్లరు తెలిపియుండిరి ॥ఈ॥

11. బాగుపడనెంచినను వినుడీ
జాగుసేయక కనుల దెరువుడి
మూఢవిశ్వాసముల వీడుచు
మూలతత్వము దెలిసి మనుడీ ॥ఈ॥

రాగం భీమ్‌పలాస్ ౧౮ ఆదితాళం

1. పరమేశ్వరుడననేమో తెలియగ
ప్రజలారా కృషి సలుపండి
పామరులై జడ పూజలుజేసిన
ఫలమేమియు నుండదు వినుడీ ।

2. రామకృష్ణ శివనామములెల్ల ఓమ్
నామమునకు సరిరావండి
రామకృష్ణ శివులెల్లరు ఓమ్
నామము జపించినారండి ॥

3. అలసులవక అష్టాంగయోగమును
అభ్యసించగా బూనండి
అతిసూక్ష్ముడు అజరామరు నాతని
అరయుట అతిసులభంబండి ॥ప్ర॥

4. యమనియమములను సోపానంబుల
క్రమముగ నెక్కుట నేర్వండి
శ్రమయనకను పద్మాసనాదులను
చక్కగ వేయుట తెలియండి ॥ప్ర॥

5. అటుపై ప్రాణాయామంబును క్రియ
నభ్యసించగా బూనండి
పటుతరశ్రద్ధతో ప్రత్యాహారము
పాటించంగా దగునండి ॥ప్ర॥

6. ధారణధ్యాన సమాధ్యవస్థలు
తప్పక లభ్యంబగునండి
ధీరులగుచు నీశ్వరుని తత్వమును
తెలిసి సుఖంబును బొందండి ॥ప్ర॥

7. వేదాధ్యయనము జేయుచు సతతము
వేదవిధుల పాటించినచో
మోదము బొందుటెగాక యితరులకు
మోదము చేకూర్చెదరండి ॥ప్ర॥

రాగం కాంభోజి ౧౯ ఆట

1. గాయత్రీ జపమహిమ తెలుసుకొ నరుడ
న్యాయపథమున నడుపు ధీ నొసగునరుడ
భయభ్రాంతులను బాపు మంత్రమిది నరుడ
నియమముతో జపియించి చూడుమో నరుడ ॥గా॥

2. ఆదిఋషివర్యులీ మంత్రమును జపియించి
మేధావులై యిలలో వేదధర్మముచాటి
అజ్ఞానమను అంధకారము తొలగించి
విజ్ఞానమను జ్యోతి వెలిగించిరో నరుడ ॥గా॥

3. అనవరతమీ మంత్రమును దీక్ష జపియించ
మానవత చేకూర్చి దానవత దొలగించు
మునులు మొదలగువారు ఘనమైన ఈ మంత్ర
మును జపించియె భువిని తరియించిరో నరుడ ॥గా॥

4. మంత్రార్థమును తెలిసి మానవులు నడిచిన
భ్రాంతులను తొలగించి శాంతియుతులను జేయు
ఎంతమాత్రము సంశయము లేదు యిందులో
కొంత శ్రద్ధతో జపము జేసి చూడు నరుడ ॥గా॥

5. గాయత్రీ మంత్రమును జపియించి బుధులెల్ల
శాయశక్తుల యితర ప్రాణులకు తోడ్పడుచు
న్యాయపథమున నడిచి హాయిగ జీవించి
న్యాయాధిపతికృపకు నర్హులైరో నరుడ ॥గా॥

6. సప్తమహా వ్యాహృతులతోడ మంత్రమును
సత్యనిష్ఠగలిగి సద్భక్తి జపియించ
భుక్తి ముక్తికిలోటు ఏమాత్రముండదు
శక్తికొలదిగ జేసి తరియించుమో నరుడ ॥గా॥

7. కామ, క్రోధ, లోభముల బాపు మంత్రము
ప్రేమభావము బెంచి పోషించుమంత్రము
ధీమంతులను జేయు దివ్యమంత్రం బిది
క్షేమ మొసగెడి మంత్రరాజమిదిగను నరుడ ॥గా॥

8. మంత్రములలోకెల్ల మహిమాన్వితంబైన
మంత్రరాజం బిది మదిలోన జపియించ
చింతలెల్ల బోవునని యనుభవముచేత
మంత్రిప్రగ్గడ జెప్పుచున్నాడు విను నరుడ ॥గా॥

*నాదనామక్రియ రాగం* ౨౦ *ఆదితాళం*

1. దారిదప్పితివిరా నరుడా ! దారిదప్పితివిరా నరుడా !
భూరిసంపదలు నీలో నుండగ
చేరి ఎచటనో వెదుకసాగితివి ॥దా॥

2. చెవిలో కలమును మరచి యింటిలో
చవటవయ్యి ఎటొ తిరిగెడి విధమున ॥దా॥

3. కంటికున్న అద్దమును గానక
చంటిపిల్లలను తిట్టువిధంబున ॥దా॥

4. ఈశుడు నీలో నుండగానక
దేశదేశముల వెదుకగ దిరుగుచు ॥దా॥

5. అద్భుత సృష్టి స్థితిలయములకు
ఆదికారణుని తెలియక మతిచెడి ॥దా॥

నాదనామక్రియ — ౨౦ — ఆదితాళం

1. నీ దయ జిలుకుమయా ఓ ప్రభో ॥నీ॥
బీదలమగు మాపైన సతతము. ॥నీ॥

2. ఖేదము దూరముజేసి మాకు నిల
మోదము గూర్చుమయా ఓ ప్రభో. ॥నీ॥

3. శక్తిహీనులము భక్తిహీనులము
యుక్తిహీనులము నీ బాలులము ॥నీ॥

4. శక్తివంతుడవు నీవుగాన కడు
శక్తి, భక్తి, యుక్తులు మాకబ్బగ ॥నీ॥

5. శరణంటిమి ప్రభో కరుణానిధివని
కరుణజూడు మిక కరుణాసాగర ॥నీ॥

6. తాపత్రయముల బడి తపించితిమి
బాపు వేగమే తాపహరుడవిక ॥నీ॥

వాదనామక్రియ ౨౩ ఆటతాళం

1. ఆపదోద్ధారక దేవా మా
ఆపదలను బాపలేవా యికనైన ॥ఆపద॥

2. తాపత్రయములచేత తపియించినాము
నీ ప్రాపుజేరగ నిశ్చయించాము
కాపాడుమని నిన్ను వేడుకున్నాము
ఆపదలను బాపలేవా యికనైన
ఆపదోద్ధారక దేవా మా ॥ఆ॥

3. దుర్గుణంబులనెల్ల దూరముజేసి
సద్గుణ సంపద సరగున నొసగి
సగుణ నిర్గుణ మమ్ము నీ దరిదీసి
ఆపదలను బాపలేవా యికనైన
ఆపదోద్ధారకదేవా మా ॥ఆ॥

4. భూతదయ మాలో గలుగగజేసి
ఆతతాయుల ద్రుంచుశక్తి మాకొసగి
పాతకములనుండి బయటబడవేసి
ఆపదలను బాపలేవా యికనైన
ఆపదోద్ధారకదేవా మా ॥ఆ॥

5. కరుణాసాగర కరుణించలేవా
నిరుపేదలము నీదు దరిజేర్చలేవా
మరువము నీ భక్తి ఓ మహాదేవా
ఆపదలను బాపలేవా యికనైన
ఆపదోద్ధారక దేవా మా ॥ఆ॥

6. ఎటుజూచినను పాపపంకమె దేవా
ఎటుల మము నీదరిజేర్తువో దేవా
భటులము మా రక్షకుడ వీవే దేవా
ఆపదలను బాపలేవా యికనైన
ఆపదుద్ధారక దేవా మా ॥ఆ॥

7. మంత్రిప్రగ్గడ వినుత మము బ్రోవలేవా
మంతనమున నిన్నే తలతుము దేవా
మంచి మార్గమునకు మము ద్రిప్పు దేవా
ఆపదలను బాపలేవా యికనైన
ఆపదుద్ధారక దేవా మా ॥ఆ॥

రాగం ౨౪ తాళం ఆట

1. రండు కలసి పరమాత్మని నామము పాడుచు
రండు పాడుచు భక్తితో పాడించుచు
ఓమ్ జపమునె సతతము జేయించుచు ॥రండు॥

2. జీవజాలమంతయు నతని సంతానమౌ వాని
సేవయె అందరికి కల్యాణమౌ ఈ
ఉప,దేశమందరికి వినుపించగ ॥రం॥

3. అన్నదమ్ములవలె మనము మెలగుచుండి
అవివేకమును మనలో రానీయకుండి
సర్వజగతి మిత్రత్వము సాధించగ ॥రం॥

4. ఎంతటి శత్రువైన స్నేహము జేయగ
అంత యత్నించి చూతాము ధైర్యముగ
వెంట రాదలచువారిని గొని చనగ ॥రం॥

*రాగం శంకరాభరణం* ౨౫ *ఏకతాళం*

1. స్త్రీపురుషులెల్ల ఓం నామమును భజించుడు
ప్రియమైన ఓం నామమెపుడు మదిస్మరించుడు॥స్త్రీ॥

2. ఆకాశ సూర్య చంద్ర పర్వత కనుమలందున
జలమందు పవనమందు మరియు అగ్నియందున
గిరికందరముల వాటికావనములందున
లోచనములందు తనువులందు మనములందున
వ్యాపకమై ఓం యున్న దఖిలవిశ్వమందున ॥స్త్రీ॥

3. దుఃఖరాత్రిని బోదరమె నీ శుభ ఓమ్‌నామము
శుభదినము మరలదెచ్చె నీ శుభ ఓమ్‌నామము
వీరుల హృదినలరించె నీశుభ ఓమ్‌నామము
విశ్వమంత నిండియున్నది ఈశుభ ఓమ్‌నామము
ధ్వనించుచున్న దఖిలమందు ఓమ్‌నామము ॥స్త్రీ॥

4. ఈ నామ ప్రతాపమున దయానందుడు వినుడి
వైదిక వివేక సత్యవ్రతధారుడై భువిలో
భయసంకటముల ధ్రువునిబోలి ధృతితో నిలచె
నిర్భయముగ ఋషి ఓంనామము జపియించగను
దుర్బుద్ధి దుష్టదంభుల మది హడలసాగెను ॥స్త్రీ॥

రాగం శంకరాభరణం — ఆదితాళం

1. పరేశు శరణము జేరుడి, ఇదె తరుణము వినుడీ ॥ప॥

2. అసత్య, ఛల, కపటములను వదలి
సత్యమందె మదినుంచుడి ఇదె తరుణము వినుడీ ॥ప॥

3. ఉదయించెను ఓంనామమనెడు రవి
లెండీ త్వరగ దర్శించుడీ; ఇదె తరుణము వినుడీ ॥ప॥

4. అనుభవించుడీ అమృతఫలమును
అఖండ పదవిని బొందుడీ ఇదె తరుణము వినుడీ ॥ప॥

5. ఓంను జపించ ముక్తిలభించును
దృఢవిశ్వాసముంచుడీ ఇదె తరుణము వినుడీ ॥ప॥

6. మానవజన్మ అమూల్యమైనది
వ్యర్థము జేయక మెల్గుడి ఇదె తరుణము వినుడీ ॥ప॥

7. ఓంనామము సదా స్మరించకుండిన.
తుదకు చింతించగల రండి, ఇదె తరుణము వినుడీ॥ప॥

8. సర్వజీవుల దయ సతతము బ్రోచెడి
సర్వమాన్యు మరువదగదండి, ఇదెతరుణము వినుడీ॥ప॥

9. పిన్నలు పెద్దలు ఎల్లరు గలిసి
ఈశ్వరు మహిమను బొగడండి, ఇదె తరుణము
వినుడీ ॥ప॥

ంకరాభరణ రాగం ౨౭ ఆదితాళం

1. సంధ్యహావనములు చాలించుటచే
సంక్షోభము ప్రబలంబాయె భువి (అహో)
సంక్షోభము ప్రబలంబాయె ॥సం॥

2. పంచ పంచ ఉషఃకాలము లోపల
మంచముపైనుండి లేచి ఈశ్వరుని
అంచితభక్తి భజించి కృత్యముల

నుంచి విశ్రాంతిని బొంది వ్యాయామము
వంచి శరీరము జేసిన వినుడీ
ఎంచరాని ఫల మీభువి లభించు
కొంచమేని సంశయములేదు సుడి ॥సం॥

3. అటుపై స్నానం బాచరించి నిజ
పటుతర భక్తితో పద్మాసనమున (సిద్ధాసన)
ఎటు మనసును బోనీయక కూర్చొని
కుటిలరహితమై సంధ్యను జేయగ
మటుమాయంబగు దుష్టప్రవృత్తులు
ఇటులే జేసి తరించిరి ఋషులును
వటువులు సహితము మీరలు జేయుడీ ॥సం॥

4. హవనముచే శుచి జల వాయువులగు
జలవాయువులచే సస్యశుద్ధియగు
సస్యశుద్ధిచే అన్నశుద్ధియగు
అన్నశుద్ధిచే వీర్యశుద్ధియగు
వీర్యశుద్ధిచే సత్సంతానంబగు
సత్సంతానమె సౌఖ్యప్రదమగు
సౌఖ్యప్రదమే సకలార్థంబగు ॥సం॥

5. చేసిరి సీతారాములు సహితము
చేసిరి ధ్రువప్రహ్లాదులు నిరతము
చేసిరి శంకర రామానుజులును

చేసిరి కృష్ణార్జునులును నిత్యము
చేసిరి మధ్వదయానందాదులు
చేయుడి తప్పక సంధ్యహావనములు
చేయుడి ఉదయం సాయములన్ ॥సం॥

భూపాలరాగం ౨౮ ఆటతాళం

1. సుప్రభాతంబాయె నిక మేలుకొనర
స్తుతియించి పరమేశుదయ జూరగొనర
స్తుతియించి పరమేశుదయ జూరగొనర
సుప్రభాతంబాయె నిక మేలుకొనర ॥సు॥

2. మానాలె నీ దుర్గుణములెల్ల వినర
జ్ఞానజ్యోతిని నీదు ఎద నిల్పుకొనర ॥సు॥

3. మానవా నీవెవరో మడువబోకుమర
మానక పరేశుమది భజియించలేర ॥సు॥

4. దీనతను నీమదిని తీసివేయుముర
మనసార భక్తితో ప్రభుని గొలువుముర ॥సు॥

5. పక్షు లదె గుమిగూడి బహుసంతసమున
అక్షరుని గొనియాడి లేచి చనినవిర ॥సు॥

6. చక్షువుల నికనైన విప్పిచూడుముర
రక్షకుని ప్రార్థించి రక్ష బడయుముర ॥సు॥

7. జలచరము లవి యెంతో సంతసము మీర
కలదుకలదొకడనుచు తలచుచున్నవిర ॥ము॥

8. కదలిసైతము తనదు జడతవీడెనుర
నిడుదలౌ కెరటాల నీళుబాడెనుర ॥ము॥

9. కలకలారవములతో నదులెల్లగనర
కలియగా సాగరుని కదులుచున్నవిర ॥ము॥

10. చలమ చలములు తపము జేయుచున్నవిర
ఇల నీవు నరుడవై ఇటులుండదగుర ॥ము॥

11. దేహమే నీవనెడి భ్రమను వీడుమురా
గేహమిది నీకనుచు తెలిసి భ్రమకుమురా ॥ము॥

12. చావుపుట్టుకలేవి లేనివాడవుర
నీవు చైతన్యమను నిజము గనుగొనర ॥ము॥

13. వెంకటార్యుని బోధ విని నడుచుకొనర
సంకటములెల్ల నిను బాసిపోవునుర ॥ము॥

రాగం కాంభోజి — అట తాళం

1. ఎన్నాళ్ళు యీరీతి ! ఉన్నతమౌ జన్మ
మన్నుపాల్జేసెదవు, ఓ మానవా ! మనుపాల్జేసెదవు॥
అన్నన్న యికనైన, క్రన్నన కనుదెరచి
మిన్నయౌ పరమాత్మ । మన్నన బడయక ॥ఎ॥

2. త్రాగుచు తినుచుండి, భోగలాలసుడవై
త్యాగమనునది మరచి । ఓ మానవా ! త్యాగమనునది మరచి
చేయరాని పనులు జేయుచు ఈ జన్మ
ధ్యేయమేమొ గనక, మాయలో బడుచుండి ॥ఏ॥

3. ఆలు పిల్లలు ఏమో । ఆలింతురనియెంచి
అన్యాయములజేయుచు, ఓ మానవా ! అన్యాయములజేయుచు
ప్రోగుచేయగ ధనము, పోటీలు బడుచుండి
రాగద్వేషములకు, బాగుగ గురియయ్యె ॥ఏ॥

4. నీది నాదియనుచు । భేదభావము బెంచి
ఏది తెలియనివారల, ఓ మానవా ! ఏది తెలియని వారల
పోరు కోపలదించి, మారణ మొనరించి
ధీరునివలెకాగ । కోరుకొనుట దగున ॥ఏ॥

5. తిండి మిక్కిలిగలుగ, దండిగ గర్వించి
చెండియాడుచుబీదలా ఓ మానవా ! చెండియాడుచు బీదల
అండ, పిండ, బ్రహ్మాండనాయకు మరచి
ఉండదగదుకదు, దండించు నా ప్రభువు ॥ఏ॥

6. ఈశుచింతనమాని, ఆశకు లోనయి
గాసిజెందుట దగునా, ఓ మానవా ! గాసిజెందుట దగునా,
త్రోసిపుచ్చుమి సర్వ । ద్రోహచింతలనెల్ల
ఖాసిల్లెదవు జగతి, ఈశుని కృపచేత ॥ఏ॥

7. దానవత్వముపీడి, మానవుడవయ్యె
జ్ఞాననిధిని గొల్పుచు, ఓ మానవా ! జ్ఞాననిధిని గొల్పుచు

ప్రేమించు జీవుల, కామ క్రోధములొదిలి
క్షేమ మపుడెయగు, నీ మహిలోపల ॥ఏ॥

8. యజ్ఞస్వరూపుని ఆజ్ఞల పాలించి
విజ్ఞుడవై వినుము, ఓ మానవా! విజ్ఞుడవై వినుము
విజ్ఞానయుతపంచ, యజ్ఞములను జేయ
అజ్ఞానమడుగంటి, ఆనందమొదవును ॥ఏ॥

9. నీకు మేలుగలుగ, నిశ్చయించితివేని
నీ యిరుగుపొరుగువారి, ఓమానవా! నీ యిరుగుపొరుగువారి
కారుణ్య దృష్టితో, కపటరహితుడవయ్యి
గారవింతువేని, గలుగు తప్పక మేలు ॥ఏ॥

10. ఇంత అన్యాయము, ఎంతోకాలము నిల్వ
దంతమౌను తుదకు, ఓ మానవా! అంతమౌను తుదకు
పంతములను వీడి, మంత్రిప్రగ్గడ బోధ
నుంతపాటించిన, ఎంతో మేలుగలుగు ॥ఏ॥

రాగం శ్రీరాగం 30 ఆది తాళం

1. జయ ఓంకార జండా
జయ జయ జయ జయ॥ జయజయజయజయ॥
జయ ఓంకార జండా ॥జ॥

2. ఆదిమధ్యాంత; రహితంబై
అలరు సర్వేశుని పేరిటిదై
ఆర్యులచే పూజింపబడిన జండా ॥జ॥

3. ఖండఖండాంతరములపా
ఖండదుర్మతముల ఖండించి
మండిత ప్రతిభగలుగు జండా ॥జ॥

4. దుర్మద ; విభేదబుద్ధి
ద్రోసి సర్వమానవులకు
ధర్మమొకటె బోధించిన జండా ॥జ॥

5. అజ్ఞానమును బోనడంచి
సుజ్ఞానమును ప్రేమనొసగి
ప్రజ్ఞాధురంధరులజేసిన జండా ॥జ॥

6. వెంకటార్య వర్యుని క
ళంకవృత్తి బోవగ ని
ష్కళంకచిత్తుగావించిన జండా ॥జ॥

మోహనరాగం 32 ఆదితాళం

1. రండు ఆర్యులార ఓం జండా కరముల ధరించి
చెండి శత్రుకోటిసేన గుండెలవియ జేయగల ॥జండా॥

2. కాసింతపరాఙ్ముఖతన్ గలుగనీక జయముగూర్చి
వాసిగన్న దేశములన్ వన్నెగనుపతాకమనుచు ॥రం॥

3. ఆర్య, ముసల్మాన్, క్రైస్త వేప్సితమగు నీ జండా
అందరు కరముల ధరించి, అందముగా శ్రేణిదీర్చి॥రం॥

ఆరభి రాగం 33 ఆదితాళం

1. లెండోయి లెండోయి, ఆర్యయువకులు
ఖండనమున వెనుదీయని భరతవీరులు ॥లెం॥

2. అక్రమచర్యల సలిపెడి అసురగణములన్
చక్రము చేబూని వేగ చెండి యాడగన్
పదుడీ, వినుడీ, మనవి
తడబడకన్ వడివడిగన్, భళియనగన్ ॥లెం॥

3. ఆర్యజ్యోతి వెలిగించుడి ఐక్యముతోడన్
ఆర్యదేశమంతట నిక అంధతవీడన్
వీరుల్, శూరుల్, ధీరుల్
కడువడిగన్, ధరవెలగన్, జడియకికన్ ॥లెం॥

4. స్థిరమతితో స్థితప్రజ్ఞలక్షణంబులన్
సరత మానవులందరు నీతికర్మలన్
సలుపన్ దగునన్ చనుచున్
బోధించన్, బూనుడికన్, జాగుసేయకన్ ॥లెం॥

5. నిర్వికారు మది దలచుచు నిర్మలభక్తిన్
సర్వజనాకర్షకులై సఖ్యముతోడన్
సరగన్, సుఖముల్, బడయన్
కృషి సలుపన్, కర్షకులన్, మేలుకొలుపగన్ ॥లెం॥

మోహనరాగం ౩౪ ఆదితాళం

1. దయానంద్ సైనికులమైనాము మేము
దయానందుని కోర్కెలీడేర్చెదము ॥ద॥

2. సదా ఓంనే మదిని జపియించెదము
ఇద్ధరలోన ధర్మమును స్థాపించెదము ॥ద॥

3. పురాణముల, అవినీతి, ఖండించెదము
పరాత్పరుడిడిన, వేదముల జూపి మేము ॥ద॥

4. దురాత్ముల మదంబణచ బోరాడెదము
పరంధాము నాజ్ఞలను పాలించెదము ॥ద॥

5. నిర్భయముగ నోంకార ధ్వజచ్ఛాయ మేము
దుర్బలుల కాశ్రయమిచ్చి రక్షించెదము ॥ద॥

6. తపోధనుల సేవించి తరియించెదము
తపోమహిమ నెల్లెడల బోధించెదము ॥ద॥

7. యథార్థమును దెల్పుటకు వెనుదీయబోము
మదాంధులకు నెపుడేని భయపడము మేము ॥ద॥

౩౫

1. రమ్మి రమ్మి రమ్మి రమ్మి రమ్మార్యుడా!
రామ (ప్రేమ) రాజ్యము స్థాపించలెమ్మార్యుడా! ॥ర॥
హిందువులు, ముస్లింలు, క్రైస్తవు
లందరార్యుల సంతతే

మంచి తెలియక చెడిన వీరికి
మంచిమార్గము జూపగా
అందరిని వేదానుయాయుల
అమితప్రేమను జేయగా,
లెమ్ము లెమ్ము లెమ్మార్యుడ, లెమ్మార్యుడా ! ॥ర॥

2. మతములన్నిటి రూపుమాపి
పతితులను దరిజేర్చగా
సతము శుద్ధ్యనుకర్మద్వారా
హితము జగతికి గూర్చగా
లెమ్ము రామలక్ష్మణులవలె లెమ్మార్యుడా ॥ర॥

3. ఆర్యధర్మం బద్వితీయంబనుచు
ధరలో జాటగా
కార్యశూరుడవగుము సోదర !
ధైర్యసాహసయుక్తుడా
కర్మయోగివై గత వైభవము నిలుపగ ॥ర॥

4. వేదధర్మను మించునట్టిది
వెదకినను భువిలేదని
వేదవిధులను అనుసరించిన
భేదమిలలో రాదని
సోదరార్య పతితులకు బోధించగ ॥ర॥

మోహనరాగం ౩౬ ఆదితాళ

1. శిరమున్నను సరెపోయిన సరెపోయిన పోనీ
ధరనార్య జాతిగౌరవమును బోనాడకుమి
దుర్గుణములవిడుమి నిర్భయుడవుగమ్మి ॥శి

2. ఇలలోన పుట్టిచచ్చుటలు సహజము వినుము
బలమున్నయపుడె మంచిపనుల జేయుచుండుము
చలకపటములను వదలి భువిలో మనుచునుండుము ॥శి

3. దుర్బలుల కభయదానమొసగి గాచుచుండుము
నిర్భయముగ నోంకారధ్వజచ్ఛాయ నిలువుము
సద్బోధలచే అజ్ఞానుల కనులు విప్పుము ॥శి

4. ఋషి మునుల గౌరవమును సతము నిలుపబూనుము
కృషి పరుల కష్టనష్టములను దొలగజేయుము
మృషయెన్నడేని బలుకదగదు ధృతిని బూనుము ॥శి

5. మానవుని మంచి దృష్టిజూచి మాన్యుడవగుము
జ్ఞానము లేక చెడువారికి జ్ఞానమొసగుము
దీనత్వము దరి రానీయక తరిమివేయుము ॥శి

6. దుష్టుల మదమణప సదా బూనియుండుము
శిష్టుల రక్షణయె నీదు ధర్మము వినుము
సృష్టికర్త, భర్త, హర్తను మది, దలచుచుండుము ॥శి

కల్యాణిరాగం 32 రూపకం

1. నినుదెలియక సుఖములేదు నిఖిల లోకనాయకా
మునులు ఋషులు నిను దెలసియె అనుభవించిరట సుఖముల

2. భూచర. జలచర, ఖేచర భూతములను సృజియించి
ఈ చరాచరముల కీవే ఈశుడవై వెలుగొందిన ॥ని॥

3. ఆకసమున గోళ చయము నద్భుతముగ ద్రిప్పుచుండి
చీకాకుల పాల్జేయక నీ కారుణ్యము జూపెడి ॥ని॥

4. శిష్టుల కాపాడెదవట దుష్టుల శిక్షించెదవట
కష్టములను బాపుదువట ఇష్టఫలము లొసగుదువట ॥ని॥

5. నీ జ్ఞాన మపారంబట నీ శక్తి యభేద్యంబట
నీ సృష్టి యనంతంబట నీ వంతట నుండెదవట ॥ని

6. అవయవంబులేవి లేక అద్భుత రచనల జేయుచు
పవనంబొనరించుచుండి సాకుదువట మము దయతో ॥ని।

7. నీ మహిమల గొనియాడగ మే మెంతటి వారమయ్య
క్షేమము చేకూర్చి మమ్ము ధీమంతుల జేయుమయ్య ॥ని॥

చ. గగనవిశాలపాత్రమునఁ గ్రాలగ జ్యోతులు చంద్రభాస్కరుల్
సొగసుగ ముత్తెముల్ పగిది శోభిలఁజుక్కలు కమ్మతెమ్మెరల్
నెగడఁగఁ జామరమ్ములుగ నిండుగ విచ్చిన పూలుచెట్లలో
నిగనిగలీన దుందుభులు నివ్వెర మ్రోయ స్వయంబుగా సదా
అగణితవైఖరిం జెలఁగు హారతి నీకుఁ ద్రిలోకనాయకా

మధురకవి

# ఆదిపూడి సోమనాథరావుగారి
# గేయాలు

*కల్యాణిరాగం* ౧ *ఆదితాళం*

దినమది సుదినము కాదా (ప్రభు) దిన మది
సుదినము కాదా

కనుఁగొని నిను మది - గానముచేసెడు ॥దిన॥

ఘనులగు నీ భక్త - జనములఁ గూడి
మునినుత నినుఁగూర్చి - ముచ్చటలాడెడు ॥దిన॥

కనికర మెదలోఁ - గరగిపాఱఁగా
ననదల కష్టము - లన్నియుఁ దీర్చెడు ॥దిన॥

ధీరత నీ యాజ్ఞఁ - దీరిచి పొల్చెడు
వీరులచరితము - విని హర్షించెడు ॥దిన॥

కళలఁదేరి స - త్కార్యము లొనరిచి
విలసిలు బుధులను - వేడ్క మన్నించెడు ॥దిన॥

నీ దయఁ గల్గిన - నిఖిల బంధువుల
నాదరించి ముద - మందుచు నుండెడు ॥దిన॥

హిందూస్థాని భైరవి ౨ చాపు

నేఁడు మనమందఱము గూడి
పాడుదము పరమేశుని
ఈడు జగమున లేక యంతట
హెచ్చి వెలిఁగెడు జ్యోతిని ॥నేఁడు॥

కందరమ్ముల మందిరమ్ముల
గహన పర్వతసీమల
సుందరధ్వనితోడ యోగులు
స్తుతియొనర్చెడు దేవుని ॥నేఁడు॥

చెట్టుచెట్టునఁ గాననంబున
జెలఁగు మధుర రుతంబులఁ
బిట్ట లెవనిని బాడుచుందునొ
ప్రీతి సాగరు నాతని ॥నేఁడు॥

సూతులందును జెరువులందును
లోఁతు తెలియని జలధిలో
శీతజలమును ద్రావి కీర్తన
చేయు జలచర మాతని ॥నేఁడు॥

ఉత్సవంబుల నుల్లమలరఁగ
నువిద లెవ్వని బాడుచు

నుత్సహింతురో యా దయామయు
నుత్తమోత్తమపురుషుని ॥నేఁడు॥

శూరులును వీరాధివీరులు
శుద్ధ హృదయాంబుజముల
సారెసారెకు నెవని దలఁతురో
సత్స్వరూపుఁ బరేశుని ॥నేఁడు॥

*మాయా మాళవగౌళ* 3 *ఆదితాళం*

ఏమని పిలుతును నిన్ను నే-నేమని పిలుతును నిన్ను ॥నే॥

స్వామీయందున సఖుఁడా యందున
ప్రేమకు నెలవగుఁ ప్రియుఁడా యందున ॥ఏమని॥

తల్లీయందున తండ్రీ యందున
యెల్లరఁ బ్రోచెడు నీశ్వర యందున ॥ఏమని॥

దివ్యసౌఖ్య మిడు దేవా యందున
అవ్యయుఁడగు పరమాత్మా యందున ॥ఏమని॥

భవరోగ మహావైద్యా యందున
వివిధ జగద్గణవేద్యా యందున ॥ఏమని॥

గుడులకు నెల్లను గురువా యందున
వరముల నిడు కల్పతరువా యందున ॥ఏమని॥
ఎంతయు భక్తుల హృదయ రంగముల
వింతగ వెలిఁగెడు వెలుఁగా యందున ॥ఏమని॥

మధ్యమావతి ౪ ఆదితాళం

మరి రాదుర యీ మానుష జన్మము
పరమపురుషు కృప వలననె గలిగెను ॥మరి॥
పరమేశునివౌ పరమాద్భుతముల
దరిసెన మొనరింప దగు యంత్రంబిది ॥మరి॥
పరి పరి విధములఁ బరులకు హితములఁ
దఱిని జేయ సాధనరాజమ్మిది
ఘన సద్గుణమణి గణము గడింపఁగ
మనకు లభించిన మహితధనమ్మిది ॥మరి॥
దేవుని జేర్పఁగ జీవుని గొని చను
దేవదత్తమౌ దివ్యరథం బిది ॥మరి॥
కాని దీనిఁ జెడుకార్యములం దిడు
వాని జన్మ మిల వ్యర్థము వ్యర్థము ॥మరి॥

బిహాగ్ — ఆదితాళము

పరమపితా మా ప్రార్థన వినురా
పాపములోఁ బడనీయకురా
శరణాగత రక్షకుఁడని నిన్నే
శరణు జొచ్చితిమి విడువకురా ॥పరమ॥

పరులను మా వలె భావించెడు మదిఁ
పరమాత్మా మాకొసఁగుమురా
నిరతము నంతట నీ మహిమలఁ గను
నిరుపమ విద్యను నేర్పుమురా ॥పరమ॥

నీ యాజ్ఞలనే నెఱవేర్పఁగ మది
నిర్మల భక్తిని గొలుపుమురా
న్యాయ సత్య కరుణాలయ మాలో
నద్భుత నాట్యము సలుపుమురా ॥పరమ॥

శాంతిధామ మా స్వాంతము నందలి
చింతల నీ వెగఁజిమ్ముమురా
అంతరంగమను నరవిందము నీ
కెంతయు బ్రీతి నర్పింతుమురా ॥పరమ॥



వ్యంగ్యకవితా ధురంధరుడు

# విద్వత్కవి శ్రీ పల్లా రామకోటార్య గారి గేయములు

విశ్వమంతటను- ఆర్యసమాజము, వేదసుధను - వెదజల్లునురా
భారతదేశపు పతనావస్థను బాపి స్వర్గమును - జేయునురా ॥విశ్వ॥
కార్యరంగమున కెక్కినచో తన, కాలును వెనుకకు - వేయదురా
ఎన్ని కష్టములు-వచ్చినగానీ, అన్నిటి తల ధరియించునురా ॥విశ్వ॥
సోమరితనమును బాపి సుజీవన, జ్యోతి నట్టె వెలి-గించునురా
ధర్మరక్షకై -తను మన ధనముల, ధారవోయుటలు-నేర్పునురా ॥విశ్వ॥
పరమ ధర్మమను-ధ్వజమును జేగొని, పాపములెల్లను మాపునురా
మతోన్మాద పా-ఖండుల మానము, మంటగలుపుటకు-జంకదురా ॥విశ్వ॥
ముదముగ ఈశ్వర-బోధలదెలుపుచు, మూఢనమ్మకము-లుడుపునురా
విధిగ నవిద్యా-తమస మడంచియు, విద్యాకాంతిని-విరియునురా ॥విశ్వ
వైదిక సందే-శంబుల నిచ్చియు, వర్ణాశ్రమముల-నిలుపునురా
స్త్రీలకు విద్యా-బుద్ధులు గఱపియు, శిష్టమార్గమును జూపునురా ॥విశ్వ
ఎల్లప్పుడు సుఖ-శాంతి వర్షముల, నిలపై విడువక-గురియునురా
భేద భావముల-నిర్మూలించియు, ప్రేమతత్వమును-పెంచునురా ॥విశ్వ॥
పతితమానవుల-ధర్మభ్రష్టుల, భద్రమార్గమున జేర్చునురా
యవన హూణమత-జాలమునన్ బడు, నట్టివారి ర-క్షించునురా ॥విశ్వ॥
ప్రజలకెల్లరకు ప్రాణప్రదమగు, పశుహింసల నిరసించునురా
విధవల దుఃఖా-నలమున గ్రమగ్గెడి, విశ్వము జూడగ-నొల్లదురా ॥విశ్వ॥
ఆశ్రయహీన అనాథల గని; తన, యంకంబున నిడి-సాకునురా
శిష్టమార్గమును జూపుచు సున్నిత, శిఖరారోహణ జేయునురా ॥విశ్వ॥
పూజ్యఋషుల గౌ-రవకాంతులు నీ, పుడమియందు-విరజిమ్మునురా
శాంతి మూలమగు-వైదిక ధర్మపు, సత్ప్రచారమును-జేయునురా ॥విశ్వ॥

౨

ఉద్భవించినావ! ఉర్వీజనుల బ్రోవ!
దయా పూర్ణ భావా దయానంద దేవా!

భారతీయ సంతతి యంతా-పరపాలన మగ్గెడినాడు।
భావదాస్య సాగరమందు-పడి పారము తెలియనినాడు।
జ్ఞానజ్యోతి చేకొని నీవ-జ్ఞానతమము బాపుటకొరకై ॥ఉ॥ ౧
మహిత వేదధర్మము పేర-మతములెన్నొ ప్రబలిననాడు,
ఒక్క దేవుడుండేచోట-పెక్కుమూర్తు లలమిననాడు,
జ్ఞానజ్యోతి చేకొని నీవ- జ్ఞానతమము బాపుట కొరకై ॥ఉ॥ ౨
అంటరానితనమను పేర-కంటగింపు బలిసిననాడు
హేయమైన కులభేదాలు-హెచ్చి కుమ్ములాడెడినాడు
జ్ఞానజ్యోతి చేకొని నీవ- జ్ఞాన తమము బాపుటకొరకై ॥ఉ॥ ౩
స్త్రీలు చదువ దోషంబనుచు-స్వేచ్ఛనే హరియించిననాడు
ధర్మచ్యుతుల బైటికిగెంటి-తలుపులన్ని మూసిననాడు
జ్ఞానజ్యోతి చేకొని నీవ- జ్ఞానతమము బాపుట కొరకై ॥ఉ॥ ౪
యాగమందు స్వర్గాపేక్ష-మూగ పశుల బలిగొనునాడు
వేదములను బాహాటముగా-విమతులెల్ల నిరసించిననాడు
జ్ఞానజ్యోతి చేకొని నీవ- జ్ఞానతమము బాపుట కొరకై ॥ఉ॥ ౫
జీవితులకు కూడే యిడక-చావ శ్రాద్ధములపెట్టేనాడు
ఫలిత జ్యోతిషంబును నమ్మి-పనికిమాలి తిరిగేనాడు
జ్ఞానజ్యోతి చేకొని నీవ- జ్ఞాన తమము బాపుట కొరకై ॥ఉ॥ ౬

౩

విను మానవ మానవా
కను మానవ మానవా ॥పల్లవి॥

చెడు కార్యముల నెన్నొ-చేస్తారు తీర్థాల
మునిగి పోయినవంచు-మురిసిపోతారు
ఇంతకే పోతేను-ఇంకేమి కావాలి
ఒకచోట నొప్పి యింకొకచోట మందురా ॥విను॥

మనునాడు కనరింత-చనిపోవ శ్రాద్ధపు
మెతుకులేవో పెట్టి-మేప జూస్తారు
ఇంతకే మేసితే-యింకేమి కావాలి
ఒకచోట నోరు యిం-కొకచోట ముద్దరా ॥విను॥

ఉన్న దేవుని వీడి-కన్న రాల్ రప్పలను
ఇక్కట్లు బాపమని-మొక్కుకుంటారు
ఇంతకే చాపితే-యింకేమి కావాలి
ఒకచోట వస్తు విం-కొకచోట గాలింపు ॥విను॥

౪

ఔనందువా లేక కాదందువా
ఒకసారి బుద్ధితో యోచించు మానవుడ ॥ఔనందు॥

ప్రకృతి అంతటనున్న ప్రాణులను, జడములను
గతులు తప్పక ఒప్పు గ్రహములను, చుక్కలను,
అఖిలజీవుల జీవనాధారభూతమై,
పరమోపయోగమగు పంచభూతాలను,
కనినప్పుడెందుకో మనసులో నెనలేని
ఒక మహత్తర శక్తి ఉన్నదనిపిస్తుంది ॥ఔ॥ ౧

ఆకసంబున నెన్న డారి పోకయె వేడి,
వెలుతురిచ్చుచు చీకటుల బాపు సూర్యుని,
కనుల విందై పేదజనుల దీపంబగుచు,
చలివెలుంగుల నిచ్చు తెలిచందమామను,
కనినప్పు డెందుకో మనసులో ఎనలేని,
ఒక మహత్తర శక్తి ఉన్నదనిపిస్తుంది ॥ఔ॥

నిరుపమానంబైన తరులతాగుల్మముల-
శిల్పముగ కత్తిరించిన రీతి ఆకులను
పలువర్ణముల వాసనల నిచ్చు పువ్వులను,
పలు రుచులతో సారభరితమౌ పండ్లను
కనినప్పు డెందుకో మనసులో నెనలేని
ఒక మహత్తర శక్తి ఉన్నదనిపిస్తుంది ॥ఔ।

ఇంపైనమేన పంచేంద్రియంబులగూర్చి,
గుండె గడియార మొకగూట భద్రముచేసి,
వెలలేని మెదడు నెమ్మలడబ్బి దట్టించి
ఉత్తమప్రాణిగా ఒప్పు ఈ మానవుని,
కనినప్పు డెందుకో మనసులో నెనలేని
ఒక మహత్తర శక్తి ఉన్నదనిపిస్తుంది ॥ఔ।

ఈ వన్నె పక్షులను, ఈ నీలిమబ్బులను,
ఈ నదీనదములను ఈ సముద్రాలను,
ఈ జీవ జంతువుల, ఈ కీటకాలను,
ఈ ఆరు ఋతువులను ఈ మహాసృష్టిని,
కనినప్పు డెందుకో మనసులో నెనలేని
ఒక మహత్తరశక్తి ఉన్నదనిపిస్తుంది ॥ఔ।

# చి॥ వి. రఘునాధరావు గారి

[ జానపదగేయాలు ]

## నాలుగు వేదాలబండి !

౧

సాకి : అదిగదిగో వస్తుందీ అందరిని పిలుస్తుందీ
ఆదిఋషుల తపోబలముతో తయ్యారైన బండి.

పాట : మిమ్ము రమ్మన్నాది మమ్మురమ్మన్నాది
అందరిని రమ్మంది ఆర్యసమాజము నుండి- ॥మిమ్ము॥

నాలుగు వేదాల బండి నడుస్తుంది సూడండి
స్వామి దయానందయోగి సాగించిన దీ బండి ॥మిమ్ము॥

ఓం ఝండాపైనుండి ఎగురుతుంది సూడండి
వేద ధర్మ మందరికి బోధించుట కీ బండి ॥మిమ్ము॥

పరమాత్మని జేర్పుటకు పరికరాలు కల బండి
పాఖండుల పారద్రోలి పరుగెడుతుందీ బండి ॥మిమ్ము॥

పరుగెడుతుందీ బండి యాక్సిడెంటు కాదండి
యోగసాధనము నేర్పి యోగ్యులచేసే బండి ॥మిమ్ము

మాంసము తినబోకండి మద్యమునే మానండి
మదిలో దేవుని దలచి-మంచి పనులు చేయండి ॥మిమ్ము॥

కులముపేర మతముపేర కుమ్ములాట తగదండి
"కృణ్వంతో విశ్వమార్య"మనే బోర్డు కల బండి॥మిమ్ము॥

# విన్నావ విన్నావ రాధమ్మ

౨

| | | | |
|---|---|---|---|
| విన్నావ విన్నావ | రాధమ్మ- | మళ్లీ మళ్లీ రాదంట | రాధమ్మ- |
| వింత వింత మాటలెన్నో | ,, | అన్ని జనుమములకన్న | ,, |
| కొ త్త మలకపేటలోన | ,, | ఉ త్తమమైన జనుమ మంట | ,, |
| దయానంద నగరమంటు | ,, | జ్ఞానమున్న మనుషులంతా | ,, |
| దయానంద నగరమందు | ,, | అజ్ఞానములో బడ్డారంట | ,, |
| రమ్యమైన పందిరేసి | ,, | మానవత లేనివాళ్లు | ,, |
| పందిరిలో పెద్దలంతా | ,, | మాంసమునె తింటారంట | ,, |
| గొప్ప గొప్ప మాటలెన్నో | ,, | కల్లు సార త్రాగేవాళ్లు | ,, |
| యిప్పి యిప్పి సెప్పినారే | ,, | కుళ్లి కుళ్లి పోతారంట | ,, |
| ఉపన్యాసం యిచ్చినారే | ,, | వెబిచారం చేసేవాళ్లు | ,, |
| వేదాలు నాలుగంట | ,, | ఎట్టి కుక్క లౌతారంట | ,, |
| కులభేదాలు లేవంట | ,, | బతికి ఉన్న పెద్దవాళ్ల | ,, |
| శూద్రులు ఆడవాళ్లు | ,, | శ్రద్ధగా సూడాలంట | ,, |
| వేదాలు సదువచ్చంట | ,, | చచ్చినంక తద్దినాలు | ,, |
| వేదాలు సెప్పేదంత | ,, | పెట్టేవాళ్లు మూర్ఖులంట | ,, |
| ఆచరణ సేయాలంట | ,, | నేడు మన దేశములో | ,, |
| ఒక్కడే దేవుడంట | ,, | వింత వింత కతలెన్నో | ,, |
| పుట్టడంట సావడంట | ,, | మనుషులే దేవుడంటు | ,, |
| అంతట ఉంటాడంట | ,, | దేవ దేవుని మరసినారే | ,, |
| అవతారలె త్తడంట | ,, | శైవులు అంటారంట | ,, |
| మానవ జనుమ మంట | ,, | శివుడే దేవుడంటు | ,, |

వైష్ణవులు అంటారంట రాధమ్మ-
విష్ణువే దేవుడంటు ,,
మతములెన్నో వెలసినాయి ,,
మతము కొక్క గురువులైరి,,
గురువు కొక్క మతము పుట్టి,,
కొట్టుకుంటు తిట్టుకుంటు ,,
వేదధర్మము మరచినారే ,,
పాడు మార్గము బట్టినారే ,,
వేదభూమిలోన నేడు ,,
పాడు మతములెన్నోవచ్చి ,,
ఆనందమార్గమంటు ,,
అక్కడక్క డొచ్చినారు ,,
వారి మతములోన జేరి ,,
వారి మాట వినకపోతే ,,
గొంతులే కోసిరంట ,,
గోతిలో పెట్టిరంట ,,
సరకారు పట్టినదంట ,,
సాగదింక వారి ఆట ,,
విదేశము నుండి నేడు ,,
ఏసు మతము వచ్చిందట ,,
ఏసు మతము పేరుమీద ,,
దేశమంత నిండినారే ,,
మాయమాట లెన్నో చెప్పి ,,
జుట్టుబొట్టు తీయమంటు ,,
చేతిలోన పైసపెట్టి ,,
వేసిరంట శిలువ మాకు ,,

వారిమాట నమ్మి మేము రాధమ్మ-
వల్లకాడు జేరినాము ,,
వద్దు వద్దు ఏసు మతము ,,
బుద్ధి చెప్పె వేదమాత ,,
బాపనోళ్ల బుద్ధులంత ,,
భోజనాల మీద బోయి ,,
వేదమంటె మరసిపోయి ,,
కాడుబడి పోయిరంట ,,
వేదములు సెప్పేవాళ్ల ,,
మూఢమార్గము బట్టినాక ,,
దేశమంత సీకటాయె ,,
జ్ఞానజ్యోతి పెట్టేవాళ్ల లేక ,,
ముందు మన స్వాములంతా ,,
మమ్ము బంధనములో పెట్టినారు,,
శూద్రులు ఆడవాళ్ల ,,
సదువరాదు వేదాలంటు ,,
సదివినోళ్ల నోటికి ,,
తాళమేయ మన్నారంట ,,
విన్నవాళ్ల సెవులలోన ,,
సీసం కాసి పోయమన్నారంట,,
స్వామి దయానంద యోగి ,,
వేదసార మంత సెప్పినారే ,,
ఒక్కసారి స్వామి మాట ,,
సక్కగా ఆలోచించి ,,
ఆర్యజాతి మేలు కోరి ,,
ఆచరిస్తె అంతా శుభం ,,

# దేవదేవుడు లేడంటారా !



దేవుడంటె ఏమిటో ? సెబుతాను వినరండి,
ఆదిఋషులు వెతికి చూసి ఇలా చెప్పినారండి, ॥దే॥

ఆకాశములో తిరిగే సూర్య చంద్ర గోళాలను -
ఎవడు త్రిప్పుచున్నాడు యెలా తిరుగుతున్నాయి,
త్రిప్పేవాడే లేక తిరుగుట సాధ్యముకాదని,
ఒప్పుకుంటె వెతకవయ్యా అప్పుడు దేవుడు దొరుకును ॥దే॥

రకరకాల పూవులెన్నొ రోజు పూస్తుంటాయి -
వింత వింత రంగులతో విడివిడిగా ఉంటాయి -
ఇంత ఎవరు చేసినారు చెట్ల కెవరు పెట్టినారు -
అంతట ఉంటాడంటు వెంటాడితె దొరుకుతాడు ॥దే॥

పాలలోన వెన్న ఉంది—పాటుబడితె దొరుకుతుంది
పండ్లలోన రసముందని పిండతేనె తెలుస్తుంది -
పరమాత్ముని చేరుటకు ప్రయత్నమును చేయండి -
ఆలా చేసిచూసి ఋషులు ఇలా చెప్పినారండి.

# యజ్ఞాంత ప్రార్థన

పూజనీయ ప్రభో హమారా భావ ఉజ్జ్వల కీజియే
ఛోడదేవేఁ ఛల కపట్ కో మానసిక బల దీజియే ॥పూజ॥

వేదకీ బోలేఁ ఋచాయేఁ సత్యకోధారణ్ కరేఁ
హర్షమేఁ హోఁ మగ్నసారే శోకసాగరసే తరేఁ ॥పూజ॥

అశ్వమేధాదిక్ రచాయేఁ యజ్ఞ పర ఉపకార కో
ధర్మమర్యాదా చలాకర్ లాభ్ దేఁ సంసారకో ॥పూజ॥

నిత్య శ్రద్ధాభక్తి సే యజ్ఞాది హమ్ కరతే రహేఁ
రోగ పీడిత విశ్వకే సంతాప్ సబ్ హరతే రహేఁ ॥పూజ॥

కామనా మిట్ జాయ్ మన్ సే పాప అత్యాచారకీ
భావనాయేఁ పూర్ణ హోవేఁ యజ్ఞ సే నరనారకీ ॥పూజ॥

లాభకారిహోఁ హవన్ హర్ జీవధారీకే లియే
వాయుజల సర్వత్ర హోఁ శుభగంధ కో ధారణ్ కియే ॥పూజ॥

స్వార్థ భావ్ మిటేహమారా ప్రేమపథ విస్తార హో
'ఇదన్నమమ' కా సార్థక ప్రత్యేకమేఁ వ్యవహార హో ॥పూజ॥

# ఆర్యధ్వజ గీతము

జయతి ఓం ధ్వజ వ్యోమవిహారీ
విశ్వ ప్రేమ ప్రతిమా అతిప్యారి -జయ-

సత్యసుధా బరసానేవాలా
స్నేహలతా సరసానేవాలా
సామ్యసుమన వికసానేవాలా
విశ్వవిమోహక భవభయహారీ -జయ-

ఇసకేనీచే బడే అభయ మ॥
సత్‌పథ పర్ సబ ధర్మధురీజన్
వైదిక రవికా హో శుభ ఉదయ॥
ఆలోకితహోవే దిశసారీ -జయ-

ఇససే సారే క్లేశ శమన హో
దుర్మతి దానవ ద్వేష దమన హో
అతి ఉజ్జ్వల అతి పావన మన హో
ప్రేమతరంగ్ బహే సుఖకారీ -జయ-

ఇసీ ధ్వజాకే నీచే ఆకర్
ఊంచ నీచకా భేద భులాకర్
మిలే విశ్వ ముద మంగల గాకర్
పంథాయీ పాఖండ బిసారీ -జయ-

ఇస్ ధ్వజకో లేకర్ హం కరమేం
భరదే వేదజ్ఞాన్ ఘర్‌ఘర్ మేం
సుగమశాంతి ఫైలే జగభరమే
మిటే అవిద్యాకీ అంధియారీ -జయ-

విశ్వ ప్రేమకా పాఠ పఢావే
సత్య అహింసాకో అపనావే
జగమే జీవన జ్యోతి జగాదే
త్యాగపూర్ణ హో వృత్తి హమారీ -జయ-

---

# ఆశయములు

## వైదికధర్మ గ్రంథమండలి
## వరలినదండీ ! వరలిందీ !!

అజ్ఞానంబును బోద్రోలంగ
ఆంధ్రులందరిని మేలుకొలుపగ
వేద ధర్మముల వెలువరించగ
సోదరాంధ్రులకు శుభము గూర్చగ ॥వై॥

శారీరక, ఆత్మిక, సామాజిక
దారుణమగు వ్యాధుల బోకార్చగ
ఆర్య ఋషుల గౌరవము నిలుపగ
ఆర్యజీవితాదర్శము దెలుపగ ॥వై॥

దొంగ గురువుల దోపిడిగాండ్ర
భంగును ద్రావెడి పరబ్రహ్మముల
పొంగుచు దిరిగెడి టక్కుటమారుల
సంగతి సమగ్రముగ దెలుపంగ ॥వై॥

ఆర్యసమాజపు గ్రంథములెల్లను
ఆంధ్రులు తమితో జదువు కొనంగను
ఆంధ్రభాషలో అనువదింపగ
అహర్నిశంబులు కృషిసలుపంగ ॥వై॥

ప్రతి నెలకొక లఘుగ్రంథము చొప్పున
ప్రతిభావంతులఁ జేయఁబంపుదుము
ప్రతికొక రూప్యము నొసగి చదువుడి
అతి శ్రద్ధగ జ్ఞానము నార్జించగ ॥వై॥